# LIKE TO FLY INTO THE EXCITING WORLD OF ADVENTURE AND HUMOUR?



**DOLTON**

**SUPER COMICS CAN TAKE YOU THERE EVERY FORTNIGHT!**

IT COSTS ONLY Rs. 2.50 A COPY- EVIDENTLY THE MOST EASILY AVAILABLE COMICS MAGAZINE YOU'VE EVER READ:

ITS 36 FULL COLOUR PAGES TAKE YOU THROUGH MYSTERY AND EXCITEMENT TO A RENDEZVOUS WITH THE SUPER HEROES–

SUPERMAN ® & BATMAN ®




**DOLTON PUBLICATIONS**

MADRAS 600 026




We're all in it together
for the fun of it,
for the taste of it!

CAMPA ORANGE FLAVOUR – IT'S THE FLAVOUR OF FUN!

OBM/5361

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''ధనాశాపరుడు''] కు ఆధారం, గండికోట సత్యనారాయణ రచన. అజీర్ణ వ్యాధితో బాధపడేవాడికి జిహ్వాచాపల్యం ఎంత హానికరమో, శ్రమద్వారాగాని లభించనివాటిపై సోమరికి ఆశవుండడం కూడా అంత హానికరమే. సరైన చికిత్సవల్లా, మంచి సలహా ద్వారా ఇద్దరూ తమ లోపాలను సరిదిద్దుకోవచ్చు. ''రైతుబంగారం'' అన్న కథలో, ఈ వాస్తవం వివరించబడింది.

## అమరవాణి

ఉపేక్ష్య సమయే కార్యే, భగ్నే చింతా నిరర్థకా,
నిర్గతే సలిలే తత్ర, సేతుబంధో నిరర్థకః.

[చేయవలసిన పని తగిన సమయంలో చేయకుండా, తరవాత పాడైనదని విచారించితే ప్రయోజనం వుండదు. నీరు వున్నప్పుడే గట్టుకట్టాలి, అది పోయిన తరవాత గట్టుకట్టి లాభమేమిటి?]

సంపుటి 74 మే '84 సంచిక 5

విడి ప్రతి : 2-00 : : సంవత్సర చందా : 24-00



# చందమామ కబుర్లు




## రాక్షసబల్లులు ఎందుకు నాశనం అయ్యాయి?

దాదాపు ఆరున్నరకోట్ల సంవత్సరాల క్రితం భూగోళమంతా వ్యాపించి వుండిన డినోసార్స్ అనే రాక్షసబల్లులు, ఉన్నట్టుండి ఎలా అదృశ్యమయ్యాయి? అంతరిక్షం నుంచి వచ్చిన చిన్న గ్రహం ఒకటి, భూగోళానికి ఢీకొని ప్రళయాన్ని సృష్టించిందనీ, ఆ ప్రళయంలోనే రాక్షసబల్లులు ఒక్కసారిగా సమూలంగా నాశనమై వుంటాయనీ — విజ్ఞానవేత్తలు విశ్వసిస్తున్నారు.

## మనిషీ - మృగమూ

క్రీ॥ పూ॥ ఆరువేల సంవత్సరాల నాటి నుంచే మానవుడు జంతువులను తన అదుపులోకి తీసుకోగలిగాడని, ఇన్నాళ్ళూ మన చరిత్రకారులు చెబుతూ వచ్చారు. కాని, లండన్ విశ్వవిద్యాలయానికి చెందిన పాల్ బాన్ అనే పురాతత్వ వస్తుపరిశోధన శాస్త్రవేత్త, దాదాపు లక్ష సంవత్సరాల క్రితమే మానవుడు, జంతువులను — ముఖ్యంగా గుర్రాలను అదుపుచేయడం నేర్చుకున్నాడని ఇటీవలి తన పరిశోధనల ద్వారా కనుగొన్నాడు.





## ఆకాశంలో స్వస్తిక్ చిహ్నం

వేలకొలది సంవత్సరాల నుంచే స్వస్తిక్ చిహ్నం, హిందువులకు పవిత్రచిహ్నంగా వుంటున్నది. పురాతన గ్రీకుదేశంలోనూ, మధ్య యుగాలలో క్రైస్తవులూ దీన్ని పవిత్రంగా భావించేవారు. చాలా కాలం క్రితం — తోకచుక్క వెలుగు కిరణాలు — భూగోళ అయస్కాంత క్షేత్రంగుండా పోయినప్పుడు ఆకాశంలో స్వస్తికాకారం కనిపించి వుండవచ్చని — టెక్సాస్‌కు చెందిన సి. జె. రాన్సమ్, హాన్స్ స్లకటర్ అభిప్రాయపడుతున్నారు.

## మీకు తెలుసా?

1. అభిజ్ఞానశాకుంతలం — అనే సంస్కృత నాటకాన్ని రచించిందెవరు?
2. ఇలియడ్, ఒడిస్సీ అనే గ్రీకు కావ్యాలను రచించిందెవరు?
3. 'పేరడైజ్ లాస్ట్' అనే ఆంగ్ల కావ్యాన్ని రచించిన కవి ఎవరు?
4. అర్థశాస్త్రం రచించిన వారెవరు?
5. సాహిత్యం కోసం నోబెల్ బహుమతి పొందిన బ్రిటిష్ ప్రధానమంత్రి ఎవరో మీకు తెలుసా?

(సమాధానాలు 64వ పేజీలో)



# రైతు బంగారం

రంగడు మహాసోమరి. వాడికి తల్లిదండ్రులిచ్చిపోయిన, నాలుగెకరాల మాగాణీ భూమి వున్నది. అది కౌలు కిచ్చి, వచ్చే దాంతో ఎలాగో రోజులు వెళ్ళబుచ్చుతున్నాడు. వాడి భార్య మాత్రం పొద్దస్తమానం, "ఏదైనా వ్యాపారం చేయకూడదా?" అని పోరుతూండేది.

"మనకేం లోటు వచ్చింది? సుఖంగా వున్నాం కదా!" అనేవాడు రంగడు.

"సుఖమంటే కూర్చుని తినడమేనా? నాకు కాసులపేరూ, వడ్డాణం చేయిస్తావని, ఎన్నాళ్ళనుంచో ఎదురు చూస్తున్నాను. నీ ఆదాయం చూస్తూంటే, అది యీ జన్మకు సాధ్యపడేలా లేదు," అన్నది రంగడి భార్య.

భార్యకు కాసులపేరూ, వడ్డాణం చేయించాలని రంగడు కూడా అనుకుంటున్నాడు. అప్పుడు యిరుగుపొరుగులలో తన ప్రతిష్ఠ పెరుగుతుంది. కానీ, ఎంతకాలమైనా వాడి ఆదాయం తినడానికే సరిపోవడం లేదు.

డబ్బెలా సంపాయించాలీ? అని వాడు తన స్నేహితుల్లో ఒకణ్ణి సలహా అడిగాడు. స్నేహితుడు రకరకాల సలహాలిచ్చాడు. ఒక్కటీ రంగడికి రుచించలేదు.

"నువ్వు చెప్పేవన్నీ కష్టమైన పనులు. అందుకు బోలెడు రోజులు కూడా పడుతుంది. ఒక్క రోజులో సులభంగా డబ్బు సంపాయించే మార్గం చెప్పు," అన్నాడు రంగడు.

"నువ్వడిగేది చాలా బాగుంది! ఒక్క రోజులో డబ్బు సంపాయించాలంటే, దొంగతనం మినహా వేరేదారి లేదు," అన్నాడు స్నేహితుడు.

రంగడు దొంగతనం చేయాలనుకున్నాడు. ఉన్న ఊళ్ళో అయితే అందరూ

జొన్నలగడ్డ రామలక్ష్మి



తెలిసినవాళ్ళే కాబట్టి, పొరుగూరు వెళ్ళా లనుకున్నాడు.

మర్నాడు ఉదయమే రంగడు, భార్యతో, "డబ్బు సంపాయించుకు రావడానికి పొరుగూరు వెళుతున్నాను. రాగానే నీకు కాసులపేరూ, వడ్డాణం చేయిస్తాను," అని ఇంట్లోంచి బయలు దేరాడు.

వాడి భార్య ఎంతో సంతోషించింది.

మధ్యాహ్నానికల్లా రంగడు పొరుగూరు చేరుకున్నాడు. అప్పుడక్కడ సంత జరుగుతున్నది. సంతలో ఒక్కొక్కళ్ళనే చాలా జాగ్రత్తగా గమనిస్తున్నాడు, రంగడు. అక్కడివారిలో ఎవరు భాగ్యవంతుల్లా కనబడితే, ఆ రాత్రికి వాళ్ళ ఇంట్లో ప్రవేశించి దొంగతనం చేయాలని, వాడి ఆలోచన.

ఆ సమయంలో వాడికి ఒక రైతు దంపతులు కనిపించారు. వాళ్ళు చూడ డానికి పేదవాళ్ళలా వున్నారు కానీ, రైతు భార్యతో, "ఏమేవ్, సంచిలో వున్న కాసుల పేరూ, వడ్డాణం ఇంటికి వెళ్ళగానే జాగ్రత్తగా గూట్లో దాచాలిసుమా," అన్నాడు.

ఈ మాటలు వినగానే రంగడు ఆగి పోయాడు. వాడు తన సమస్య తీరి పోయినట్టే భావించాడు. తను డబ్బు దొంగిలించి, దానితో కాసులపేరూ, వడ్డాణం చేయించాలనుకుంటున్నాడు! సరాసరి ఆ వస్తువులే దొరుకుతూంటే, అంతకన్న అదృష్టమేముంటుంది?

రంగడు రైతు దంపతులను బాగా గుర్తుంచుకున్నాడు. వాళ్ళనే అనుసరించి తిరిగాడు. వాళ్ళు సంత నుంచి ఇల్లు చేరగానే, వాళ్ళ దగ్గిరకు వెళ్ళి, "అయ్యా, పరదేశిని. ఈ రాత్రికి మీ ఇంట్లో, నాకు ఆశ్రయమిస్తారా?" అని అడిగాడు.

రైతు సాదరంగా, "ఈ రాత్రే కాదు, నీ యిష్టమైనంత కాలం, నా ఇంట్లో వుండు," అన్నాడు.



ఆ రాత్రి రైతు భార్య, రంగడికి రుచికరమైన వంటకాలు చేసి పెట్టింది. రంగడు మాత్రం మత్తుతో నిద్ర పడుతుందన్న భయంతో, కడుపునిండా భోజనం చేయలేదు.

రాత్రి పడుకోబోయేముందు రైతు, భార్యను, "కాసుల పేరూ, వడ్డాణం జాగ్రత్తగా గూట్లో దాచావా?" అని అడిగాడు. దాచానన్నది భార్య.

ఈ మాటలు రంగడు విని, తన పంట పండిందని సంతోషించాడు. వాడు ఆ గూడును బాగా గుర్తుపెట్టుకుని, ఒక రాత్రి పూట లేచి రైతు దంపతులున్న గదిలోకి వెళ్ళాడు.

రైతు పెద్దపెట్టున గుర్రు పెడుతున్నాడు. రైతు భార్య నిండా దుప్పటి కప్పుకుని నిద్రపోతున్నది.

"వీళ్ళు చాలా అజాగ్రత్త మనుషులు. అంత బంగారం దాచుకుని, ఇంట్లో పరదేశి వుండగా, ఎంత నిశ్చింతగా నిద్రపోతున్నారో!" అని రంగడు అనుకున్నప్పటికీ, అదీ ఒక రకంగా తన అదృష్టమేనని సంతోషిస్తూ ' గూడు దగ్గరకు వెళ్ళాడు.

గూట్లో ఒక మూట వున్నది. ఆ మూట చాలా బరువుగా వున్నది. కాసులపేరూ, వడ్డాణం వున్న మూట అంత బరువుగా వున్నందుకు రంగడు ఆశ్చర్యపడుతూ, దాన్ని గూట్లోంచి బలంగా లాగబోయి, పొరబాటున పక్కనే వున్న ముక్కాలి పీటను కాలితో తన్నాడు. వెంటనే పెద్ద చప్పుడయింది.

రైతూ, రైతు భార్యా లేచి రంగణ్ణి చూశారు. రంగడు సిగ్గుతో తల వంచుకున్నాడు. వాడికి పారిపోయే అవకాశం కూడా లేదు.

"ఆ గూటి దగ్గిర, నీకేం పని?" అని అడిగాడు రైతు.

"కాసులపేరూ, వడ్డాణం లేవు; నా పొలానికి విత్తనాలు మాత్రం వున్నవి," అని, అదేపనిగా నవ్వసాగాడు, రైతు.

"చూడ్డానికి పెద్ద మనిషిలా వున్నావు. దొంగతనానికి వచ్చావా ?" అన్నది రైతు భార్య ఆశ్చర్యంగా.

"నేను దొంగతనం చేయాలనుకోలేదు. మీరు చాలా మంచివాళ్ళు. కొత్తవాళ్ళను నమ్మకుండా, మీ కొక పాఠం చెప్పాలనుకున్నాను. గూట్లోని బంగారాన్ని కాజేసి, మిమ్మల్ని ఒక రోజంతా ఏడిపించి, అప్పుడు దాన్ని తిరిగి యిచ్చివేయాలనుకున్నాను. కానీ, తీరాచూస్తే, అసలు గూట్లో బంగారమే లేదు!" అన్నాడు రంగడు తన తప్పును కప్పి పుచ్చుకునేందుకు ప్రయత్నిస్తూ.

రైతు నవ్వి, "నీ ఉద్దేశం ఏమైనా, మా ఇంట్లో బంగారమంటూ లేదు. సంగతేమంటే, యింతకాలంగా నాకు సొంత పొలం లేదు. నాలుగేళ్ళపాటు కౌలుకు ఇతర్ల పొలం సాగు చేశాక, కొంత డబ్బు కూడబెట్టి, ఈ ఏడే సొంత పొలం కొన్నాను. రెండెకరాల సొంత పొలం వుంటే, నా భార్యకు కాసులపేరూ, వడ్డాణం చేయించడానికి ఒక సంవత్సరం చాలు. అందుకే, ఈ రోజు సంతలో విత్తనాలు కొని, వాటిని కాసులపేరూ, వడ్డాణం అని ముద్దుగా పిలుస్తున్నాను," అన్నాడు.

రెండెకరాల సొంత పొలంతో, ఒక్క సంవత్సరంలో భార్యకు నగలు చేయించగలనని రైతు అనగానే, రంగడికి బుద్ధి వచ్చింది. తాను నాలుగెకరాల సొంత పొలం వున్న రైతు! సోమరితనం వదిలించుకుని సొంతంగా వ్యవసాయం చేసుకుంటే, తను భార్యకు కాసులపేరూ, వడ్డాణమే కాదు, మరి కొన్ని నగలు కూడా చేయించవచ్చు!

వాడు రైతుకు తన కృతజ్ఞత చెప్పుకుని, ఇల్లు చేరి, సొంత వ్యవసాయం ప్రారంభించి, ఏటేటా భార్యకు కొత్త నగలు చేయించసాగాడు.

ఆ తరవాత రంగడి భార్య, ఏనాడూ వాణ్ణి ఏదైనా వ్యాపారం చేయమని పోరు బెట్టలేదు.






## 13

[పింగళుడి అన్నలు ఇంట్లో వున్న డబ్బును పంచుకుని, మహత్తు గల సంచీ ఎవరి భాగానికి రావాలనే దగ్గిర పేచీపడి కొట్లాడుకోసాగారు. ఈ సంగతి రాజుకు తెలిసి వాళ్ళిద్దర్నీ ఖైదులో పెట్టించాడు. ఇక పింగళుడున్న ఓడకూ, మరో ఓడకూ మహా సముద్రం మీద యుద్ధం ప్రారంభమయింది. సరంగు, బానిసలను విడిపించి, వాళ్ళకు ఆయుధాలిచ్చాడు. తరవాత —]

సరంగు ఆజ్ఞ కాగానే గొలుసులకు బంధింపబడి వున్న బానిసలందరూ విడిపించబడ్డారు. వారిలో ప్రతి ఒక్కరికీ కత్తీ, విల్లమ్మూ యివ్వబడింది. ఆ సమయంలో సరంగు వాళ్ళమీద ఎక్కడలేని ఆప్యాయతా కనబరుస్తూ, "మీరు యీ క్షణం నుంచీ బానిసలు కారు; యోధులు! మన ఓడ పెద్ద అపాయంలో చిక్కుకున్నది. మన ఓడను వశపరుచుకో చూస్తున్న ఆ శత్రు ఓడకు మనం లొంగిపోయామంటే, ఆ తరవాత బతికివున్నాళ్ళూ వాళ్ళకు మనం బానిసవృత్తి చేస్తూ హీనంగా జీవించవలసి వస్తుంది. అలాకాక మనం జయిస్తే, అందరం స్వేచ్ఛగా హాయిగా కాలం గడపవచ్చు. కనక, ప్రాణరక్షణ కోసం, స్వతంత్రం కోసం, స్వేచ్ఛకోసం ధైర్యంతో తెగించి పోట్లాడండి," అన్నాడు.



సరంగు మాటల్లో బానిసలకు నమ్మకం కుదరలేదు. అతడు తమనెంత క్రూరంగా హింసించాడో వాళ్ళల్లో ప్రతి ఒక్కరూ గుర్తుపెట్టుకునే వున్నారు. అయినా యీ తరుణంలో చేయవలసిందేమిటి? శత్రు ఓడలోంచి ఎడతెరిపి లేకుండా బాణాలూ, అగ్నిగోళాలూ వచ్చి తమ ఓడ మీద పడుతున్నవి. ఓడ నిప్పంటుకుని కాలి మునిగిపోతే, దానితోపాటు తామూ సర్వనాశనం కాక తప్పదు.

బానిసల మనసుల్లో కదులుతున్న యీ అనుమానాలూ, సంశయాలూ పింగళుణ్ణి కూడా బాధించినై. కాని, అతడు వెంటనే ఒక నిర్ణయానికి వచ్చాడు. తాము వున్న ఓడ నీట మునగకుండా రక్షించవలసిన అవసరం వుంది. కాని, అతి క్రూరుడైన సరంగు మాత్రం బతికివుండటం ప్రమాదకరం. ముందు అతణ్ణి తుదముట్టించాలి. తరవాత వీలు చూసుకుని శత్రు ఓడలోని వారితో రాజీపడి తమ దారిన తాము పోవాలి!

పింగళుడు యిలా ఆలోచించి, తన తోటి బానిసలకు కర్తవ్యం ఏమిటో తెలియబరిచాడు. ప్రస్తుతానికి ఆ శత్రు ఓడ సంగతి మరిచిపోయి, ముందు తమ ఓడ సరంగునూ, అతడి అనుచరులనూ తుదముట్టించటం క్షేమమని చెప్పాడు. బానిసలందరూ యిందుకు ఒప్పుకున్నారు. యువకుడూ, తెలివిగలవాడూ, సాహసీ అయిన పింగళుడి నాయకత్వాన్ని వాళ్ళు అంగీకరించారు.

పింగళుడు వెంటనే సముద్రం మారుమోగేలా అరుస్తూ, "సరంగునూ, వాడి అనుచరులనూ హతమార్చండి, రండి!" అంటూ ముందుకు దూకాడు.

బానిసలందరూ ఒకేసారి సింహాల్లా గర్జిస్తూ తమను హింసలపాలు చేసిన సరంగు మీదా, అతడి అనుచరుల మీదా కత్తులు దూసి దూకారు. పరిస్థితి యిలా విషమంగా పరిణమిస్తుందని సరంగు వూహించలేదు. ఒకవైపు నుంచి శత్రు



ఓడ నిప్పులు చెరుగుతూ వస్తున్నది. అదే సమయంలో తన ఓడలోని బానిసలు తన మీద కత్తులు దూశారు.

సరంగుకు ఆలోచించేందుకు వ్యవధి లేదు. అతడు తన అనుచరులకు ఆజ్ఞలు యిచ్చేలోపలే బానిసలు వారి మీద పడి కత్తులతో వాళ్ళను ముక్కలుగా నరికేస్తున్నారు. "ద్రోహం, మోసం! ముందు యీ బానిసలను యమపురికి పంపండి!" అంటూ సరంగు భీకరంగా అరిచి వాళ్ళ మీద పడ్డాడు. బలశాలీ, జిత్తులమారీ అయిన సరంగు కత్తిదెబ్బకు కనుమూసి తెరిచేంతలో అయిదారుగురు బానిసలు ఆహుతి అయారు. అది చూసిన కొందరు బానిసలు భయకంపితులై వెనక్కు పారి పోసాగారు.

పింగళుడు ప్రమాదం గుర్తించాడు. వెంటనే అతడు కత్తి పైకెత్తి సరంగు కేసి లంఘిస్తూ, పారిపోతున్న బానిసలను హెచ్చరించాడు: "సరంగును ఒక్క క్షణంలో నా కత్తికి ఎరచేస్తాను. మీరు ప్రాణభయంతో పారిపోయినా, మిమ్మల్ని సముద్రం పొట్ట పెట్టుకోక మానదు. మీ స్వేచ్ఛకొరకు తెగించి పోరాడండి!"

పింగళుడి మాటలు పారిపోతున్న బానిసలలో తిరిగి ధైర్యోత్సాహాలను కలిగించినై. యీ లోపల పింగళుడు కొదమ సింహంలా గర్జిస్తూ, సరంగును ఎదుర్కొన్నాడు. అతడు తొలిసారిగా విసిరిన కత్తి దెబ్బ, సరంగు గుండెలను రాచుకుంటూ పోయింది. సరంగు "హా, భైరవీ!" అంటూ గుండె మీద చేయి నొక్కిపట్టి, నిప్పులు చెరిగే కళ్ళతో పింగళుడి మీదికి కత్తి ఝళిపిస్తూ ఉరికాడు.

సరంగు దేహబలం, కత్తి యుద్ధంలో అతడి నేర్పూ చూసిన పింగళుడు, చప్పున పక్కకు తప్పుకున్నాడు. సరంగు ఆ ఆవేశంలో పింగళుడు తన కత్తి దెబ్బకు అందకపోగా, ముందుకు తూలి, ఒక తాడు కాలికి చుట్టుకునేసరికి బోర్లా పడిపోయాడు. పింగళుడికి యిది మంచి

అవకాశం యిచ్చింది. అతడు భీకరంగా అరుస్తూ, సరంగు వీపుమీద కత్తిని గుచ్చ బోయాడు. కాని, సరంగు తనకు రానున్న ప్రమాదాన్ని గ్రహించి చటుక్కున పక్కకు దొర్లాడు. పింగళుడి కత్తి అక్కడ వున్న కొయ్యలో బలంగా గుచ్చుకుని రపీమని మధ్యకు విరిగిపోయింది.

సరంగు వికటాట్టహాసం చేశాడు. "ఓహో, నువ్వు బానిసల నాయకుడివి కాబోలు! నాయకుడు ఎంత ప్రమాదంలో చిక్కుకుపోయాడు! యీ కత్తితో నిన్ను ముక్కలుగా నరికి సముద్రంపాలు చేస్తాను. తరవాత నీ అనుచరులందర్నీ...."

సరంగు ఒళ్ళు తెలియని ఆవేశంలో వుండి, పింగళుడు ఏమి చేస్తున్నదీ గమనించలేదు. తన కత్తి విరిగిపోగానే పింగళుడు రానున్న ప్రమాదాన్ని వెంటనే గ్రహించాడు. మరో కత్తి దొరకపుచ్చుకునేందుకు అందుబాటులో ఎక్కడా లేదు. తన అనుచరులైన యితర బానిసలు సరంగు అనుచరులతో పోరాడుతున్నారు.

పింగళుడు మెరుపులా పక్కన పడి వున్న తాడు నొకదానిని చేతికి తీసుకుని, దాని కొసను ఉచ్చులా బిగించి, సరంగు కోసం సర్వసిద్ధంగా వున్నాడు. ఒళ్ళు మరిచిన ఆవేశంలో సరంగు అరుస్తూ కత్తితో ముందుకు దూకబోయేంతలో, పింగళుడి చేతనున్న తాడు గిర్రున తిరుగుతూపోయి, సరంగు గొంతుకు



ఉచ్చుబిగుసుకున్నది. వెంటనేపింగళుడు తన చేతగల తాడును గట్టిగా గుంజుతూ వెనక్కు పరిగెత్తాడు.

సరంగు పెద్దగా ఓండ్ర పెట్టి, మానులా దభీమని ముందుకు పడిపోయాడు. కాని, అతడు తన చేతికత్తితో తాడును కోసేందుకు ప్రయత్నించాడు. అది గమనించిన పింగళుడు వెనక్కు తిరిగి తన అనుచరులను కేకవేశాడు. వెంటనే యిద్దరు బానిసలు పరిగెత్తుతూ వచ్చి, సరంగు కిందపడి వుండటం చూస్తూనే అతడి మీదికి వురికి, తమ కత్తులతో తూట్లుపడేలా పొడిచారు.

సరంగు మరణంతోగాని పింగళుడికి చుట్టూ ఏమి జరుగుతున్నదీ చూసే అవకాశం కలగలేదు. అతడు ఒక బానిస వద్ద నుంచి కత్తి తీసుకుని, ఓడలో ఒక మూల జరుగుతున్న పోరాటం కేసి పరిగెత్తాడు. అతడు ఆ ప్రాంతానికి చేరేసరికి, కొద్దిగా మిగిలి వున్న సరంగు అనుచరులు కూడా చంపబడటమో, గాయపడి ఖైదీలుగా దొరకటమో జరిగిపోయింది.

ఈ లోపల శత్రు ఓడలోని సైనికులు కోలాహలంగా అరుస్తూ, పింగళుడున్న ఓడను సమీపిస్తున్నారు. వాళ్ళు విధీ విరామం లేకుండా ఓడమీదికి బాణాలు వదలటం మాత్రం మానలేదు. తమ శత్రు ఓడలో ఏదో కలహం ప్రారంభమయిందనీ, యిదే అదనుగా తాము దాన్ని వశపరుచుకోవచ్చుననీ వాళ్ళు భావించారు.





పింగళుడికి ఏమి చేసేందుకూ పాలు పోలేదు. ఆ శత్రు ఓడతో పోరాడటం తన వెంట వున్న కొద్దిమంది అనుచరుల వల్లా సాధ్యమయేది కాదు. అలా కాదని దానికి లొంగిపోతే, వాళ్ళు తిరిగీ తమను బంధించి, తమచేత బానిసవృత్తి చేయించ వచ్చు. అసలు శత్రు ఓడలో వున్న నావికు లెందరు ?

పింగళుడు, సరంగునుంచి లాక్కున్న దుర్భిణీలోంచి శత్రు ఓడకేసి చూశాడు. ఓడ అంతా నావికులతో కిటకిటలాడి పోతున్నది. ఇక వాళ్ళతో పోరాడి లాభం లేదని పింగళుడు గ్రహించాడు. ముందు తన ఓడమీద తెల్లజెండా ఎత్తి, తమ పరి స్థితిని ఆ ఓడలోని వారికి తెలియపరిచి, రాజీమార్గంగా ఎవరి దారిన వాళ్ళు పోవటం ఒక్కటే మంచి మార్గంగా అతడికి తోచింది. కాని, వాళ్ళు అందుకు అంగీకరిస్తారా ?

తమ ఓడ మీదికి శత్రు నావికులను రానీయకుండా, ఆ ఓడను అంతదూరాన వుంచి రాజీ రాయబారాలు నడపటం క్షేమమని పింగళుడు నిర్ణయించు కున్నాడు. వెంటనే అతడి ఆజ్ఞ ప్రకారం ఓడకొయ్యకు తెల్లజెండా ఎత్తబడింది. మరుక్షణం శత్రు ఓడలోంచి విజయ ధ్వానాలు విన్నబడినై.

పింగళుడు పెద్ద బూరలాంటి సాధనం లోంచి, శత్రు ఓడలోని వారితో, తన ఓడలో జరిగిన దానిని గురించి చెప్పాడు: "మీ ఓడను అటకాయించి, వశపరుచు కోవాలని చేసిన ప్రయత్నంతో మా కెవరికీ సంబంధం లేదు. బానిసలమైన మేమంద రమూ, క్రూరుడైన మా యజమాని సరం గునూ, అతడి అనుచరులనూ హత మార్చాము. ఇక యిప్పుడు మేము కోరే దల్లా మా ఓడను ఏదో ఒక రేవుకు నడిపి, అక్కడినుంచి ఎవరెవరి దేశాలకు వాళ్ళం వెళ్ళిపోవటం. కనక, మీరు రాజీపడి మా జోలికి రాక, సముద్రం మీద మీ దారిన మీరు వెళ్ళవలసిందిగా కోరు

తున్నాము,'' అన్నాడు పింగళుడు ఎంతో ఉత్సాహంగా.

ఈ మాటలు వింటూనే శత్రు ఓడలో గందరగోళం బయలుదేరింది. కొంచెం సేపు తరవాత అది సర్దుమణగ్గానే, భీకర మైన ఒక గొంతు యిలా అరిచింది:

''బానిసలైన మీకు స్వేచ్ఛగా మహా. సముద్రాల మీద ఓడను నడిపే హక్కు లేదు. పైగా యజమానినీ, అతడి అను చరులనూ చంపటం ద్వారా మీరు క్షమించరాని నేరం చేశారు. అందుకు మీరు శిక్ష అనుభవించవలసిందే. లేక పోతే, మీ నుంచి పాఠం నేర్చుకుని, మా ఓడలోని బానిసలు కూడా ఒకానొకరోజున మమ్మల్నందర్నీ తుదముట్టించవచ్చు. ఓడకు లంగరు దించి, కిమ్మనకుండా మాకు లొంగిపొండి!''

ఈ మాటలు వింటూనే పింగళుడు నిర్విణ్ణుడయిపోయాడు. అది వర్తకపు ఓడ మునుగులో దాగివున్న సముద్రపు దొంగల ఓడ అని అతడికి అర్థమై పోయింది. అలాటి ఓడలోనివారికి తనూ, తన అనుచరులూ లొంగటమంటే, తిరిగి తామందరూ బానిసలుగా అమ్ముడు పోవటమేనన్నమాట.

ఒకటి రెండు మాటల్లో పరిస్థితినంతా పింగళుడు తన అనుచరులకు చెప్పాడు.



వారిలో ప్రతి ఒక్కరూ పోరాడటానికే సిద్ధమన్నారు. లొంగిపోయి జీవితమంతా బానిసలుగా బతకటం కన్న, పోరాడుతూ చచ్చి సముద్రంపాలు కావటం ఉత్తమం అని వాళ్ళు ఏకకంఠంగా జవాబిచ్చారు.

వెంటనే ఓడస్తంభం మీంచి తెల్ల జెండా దించబడింది. ఓడలోంచి జయ జయ ధ్వానాలు మిన్నుముట్టినై. సంఖ్యా బలంలో అధికులైన శత్రుసైనికులు, ఒకసారి తన ఓడలోకి ఎక్కగలిగితే, యిక తను చేయగలిగిందేమీలేదు. కనుక, సాధ్యమైనంతవరకూ శత్రు ఓడకు దూరంగా వుండి బాణాలతో యుద్ధం చేస్తూ, యిక తప్పనిసరి అయితే, తన

ఓడతో శత్రు ఓడను ఢీ కొట్టాలని పింగళుడు నిశ్చయించుకున్నాడు.

తిరిగి యుద్ధం ప్రారంభమయింది. పింగళుడి అనుచరులు బాణాలు ఎక్కుపెట్టి శత్రు ఓడమీదికి వదులుతున్నారు. పింగళుడు ఓడను వెనక్కు నడపమన్నాడు. సాధ్యమైతే, పోరాడుతూనే తన ఓడను శత్రు ఓడకు అందకుండా నడిపించుకు పారిపోవాలని కూడా పింగళుడు నిర్ణయించుకున్నాడు. కాని, శత్రు ఓడనుంచి పారిపోవటం సాధ్యమయే పని కాదని కొద్దిసేపట్లోనే తెలిపోయింది. చూస్తూండగానే ఆ ఓడ బహు వేగంగా ముందుకు రాసాగింది.

పింగళుడు చటుక్కున ఒక నిర్ణయానికి వచ్చాడు. విజయమో, వీరస్వర్గమో—అంతకన్న మార్గం లేదు. ఓడను వేగంగా ముందుకు నడిపి, శత్రు ఓడను ఢీ కొట్టవలసిందిగా అతడు తన అనుచరులను ఆజ్ఞాపించాడు. వెంటనే ఓడ ముందుకు కదలసాగింది. మొదట ఆశ్చర్యపడి, అంతలోనే పింగళుడు తలపెట్టినదేమిటో గ్రహించిన శత్రుసైనికులు భయంతో కంపించిపోయి, ఒక్కసారిగా హాహాకారాలు చేశారు.

ఓడను వెనక్కు నడపటం ద్వారా ప్రమాదాన్నుంచి బయటపడేందుకు శత్రు సైనికులు చేసిన ప్రయత్నం ఫలించలేదు. పింగళుడు కత్తి ఝుళిపిస్తూ, తన అనుచరులకు ఓడను వేగంగా ముందుకు నడిపి శత్రు ఓడను ఢీ కొట్టవలసిందిగా హెచ్చరిస్తున్నాడు.

చూస్తూండగానే ఓడ మహా వేగంతో ముందుకు కదిలి, శత్రు ఓడను తాకింది. ఆ మరుక్షణంలో వేయిగొంతులు కలిసి కట్టుగా చేసిన ఆర్తనాదం సముద్రం మీద మారుమోగింది.

రెండు ఓడలూ ఢీ కొనటంలో కలిగిన తాకిడికి, పింగళుడు తను వున్న చోటు నుంచి గాలిలోకి ఎగిరి, గిరవాటు వేసినట్టు, అల్లంత దూరాన సముద్రంలోపడి పోయాడు. —(ఇంకావుంది)






# ధనాశాపరుడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి, భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, నీ పట్టుదలా, కార్యసాధన పట్ల అచంచలమైన దీక్షా చూస్తూంటే, నువ్వేదో అపూర్వ శక్తులను సాధించదలచావని అనుమానం కలుగుతున్నది. మంత్రతంత్రాల ద్వారా వాటిని సాధించడం చాలా కష్టం; సాధించిన వాటిని స్వప్రయోజనానికి ఉపయోగించుకోగలగడం, అంతకన్న కూడా కష్టం. ఇందుకు హెచ్చరికగా నీకు, రామశర్మ, కృష్ణశర్మ అనే తండ్రీకొడుకుల కథ చెబుతాను. శ్రమ తెలియకుండా విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

వైశాలీ నగరంలో రామశర్మ అనే పౌరోహిత్య బ్రాహ్మణుడుండేవాడు. పౌరో

## బేతాళ కథలు



హిత్యం మీద అతడికి సంపాదన బాగానే వుండేది. అతడి సంసారం కూడా ఏమంత పెద్దది కాదు. అతడూ, భార్యా, కొడుకూ, ఒక కూతురూ.

ఎలాంటి ఆర్థిక యిబ్బందులు లేకుండా కాలం గడిచిపోతున్నా, రామశర్మకు జీవితంపట్ల తీరని అసంతృప్తి వుండేది. అతడు రాజాస్థానంలోని ఉద్యోగులలా, కవి పండితులలా భోగభాగ్యాలు చూసి తరచూ ఈర్ష్యపడుతూండేవాడు. తానూ ఏదో విధంగా రాజాదరణ పొందగలిగితే, వాళ్ళ లాగా ధనకనక వస్తువాహనాలతో ఎంతో గొప్పగా బతకవచ్చని కలలు కంటూండేవాడు.

రామశర్మ కొడుకు కృష్ణశర్మ యుక్తవయస్కుడై, పౌరోహిత్యంలో తండ్రికి సాయపడసాగాడు. ఆ స్థితిలో రామశర్మకు ఒక ఆలోచన కలిగింది. తాను హిమాలయాలకు పోయి, అక్కడ వున్న సిద్ధుల ద్వారా, ఏవైనా అపూర్వశక్తులు సంపాయించగలిగితే, క్షణాల మీద గొప్ప ఐశ్వర్యవంతుడై పోవచ్చు!

రామశర్మ యిలా ఆలోచించి, ఇంట్లో ఎవరికీ చెప్పకుండా, ఒకనాడు బయలుదేరి హిమాలయాలకు వెళ్ళిపోయాడు. అక్కడ ఒక సిద్ధుణ్ణి ఆశ్రయించి, ఆయనకు భక్తిశ్రద్ధలతో సేవలు చేస్తూ, త్వరలోనే ఆయన ఆదరణకు పాత్రుడయ్యాడు.

సిద్ధుడు రామశర్మ వచ్చిన కారణం గ్రహించి ఒకనాడు అతడితో, ''నాయనా, నువ్వు భార్యాబిడ్డలుకలవాడివి. ముఖ్యంగా నీ కూతురూ, కొడుకుల పెళ్ళి బాధ్యత నీ మీద వున్నది. కనక, ఇంటికి తిరిగిపో. ఇంతకాలంగా నాకు ఎంతో భక్తిశ్రద్ధలతో సేవలు చేశావు. నువ్వేదయినా కోరదలిస్తే కోరు, యిస్తాను,'' అన్నాడు.

అందుకు రామశర్మ, ''స్వామీ, నాకు అపూర్వశక్తులు లభించేందుకు, ఏదైనా మంచి మంత్రోపదేశం చేయండి,'' అని కోరాడు.

సిద్ధుడు అందుకు సరేనని, "నాయనా, నీకు ఒక మంత్రం ఉపదేశిస్తాను. ఆ మంత్రశక్తి కారణంగా, నీకు కొన్ని అపూర్వశక్తులు స్వాధీనంలో వుండ గలవు. ఏనాడూ ధనవ్యామోహానికి దాసు డవు కాకు. మంత్రశక్తిని పదిమంది మేలుకు ఉపయోగించు," అని, రామ శర్మకు మంత్రాన్ని ఉపదేశించాడు.

ఈ విధంగా రామశర్మ వెళ్ళిన పని సాధించుకుని, ఇంటికి తిరిగి వచ్చాడు. అతడు లేని సమయంలో అతడి కొడుకు కృష్ణశర్మ పౌరోహిత్యం చేస్తూ, ఏ యిబ్బందులూ లేకుండా కుటుంబాన్ని పోషించుకు వస్తున్నాడు.



అయితే, రామశర్మ తిరిగి వచ్చిన సమయంలో, వైశాలీ రాజ్యం కరువు కాటకాలకులోనై, ప్రజలు నానాయిక్కట్లూ పడుతున్నారు. అప్పటికి రెండేళ్ళుగా రాజ్యంలో వర్షాలు లేవు. రాజు వర్షం కోసం వరుణజపాలూ, రుద్రయాగాలూ మొదలైనవి ఎన్నో చేయించాడు. కాని, ఫలితం లేకపోయింది. ఎవరైనా తమ శక్తియుక్తులతో రాజ్యంలో వర్షాలు కురి పిస్తే, వాళ్ళకు కనకాభిషేకం చేస్తానని రాజు ప్రకటించాడు.

కనకాభిషేకం మాట వింటూనే రామ శర్మ ఎంతో ఉత్సాహంగా కొడుకును పిలిచి రహస్యంగా, "బాబూ, ఎన్నో శ్రమలుపడి, అవస్థలకోర్చి నేను హిమా లయాలు చేరాను. అక్కడ ఒక సిద్ధుడు నాకొక మంత్రాన్ని ఉపదేశించాడు. ఆ మంత్రశక్తితో నేను, మన రాజ్యంలో వర్షాలు కురిపించగలను!" అన్నాడు.

తండ్రి మాటలకు కృష్ణశర్మ ఆశ్చర్య పడి, "నిజమా? మీరు మంత్రశక్తి ద్వారా వానలు కురిపించగలరా! ప్రజలు నీళ్ళు దొరక్క అవస్థలుపడుతున్నారు. వెంటనే వర్షాలు కురిసేలా చేసి, రాజ్యానికి మేలు చేయండి," అన్నాడు.

"రాజ్యానికి మేలు మాట సరే, మన మేలు మాటేమిటి? ముందుగా రాజు

గారికి చెప్పకుండా ఆ పని చేస్తే, రాజు గారు అందుక్కారణం నేనని, ఎలా నమ్మగలరు ? అప్పుడు, ఆయన చేస్తా నన్న కనకాభిషేకం, నాకు దక్కకుండా పోతుంది,'' అన్నాడు రామశర్మ.

ఏనాడూ తండ్రి మాటకు ఎదురు పల కని కృష్ణశర్మ కొంత ధైర్యం తెచ్చుకుని, ''నాన్నగారూ, మనం, మనకు చేతనైన వృత్తిలో సుఖంగానే బతుకుతున్నాం కదా. ఈ కనకాభిషేకాలెందుకు?'' అన్నాడు.

ఆ జవాబుకు రామశర్మ కోపం తెచ్చు కుని, ''నువ్వు అంతగా లోకజ్ఞానం లేని వాడివి, నే చెప్పినట్టు విను,'' అని కొడు కును మందలించి, ''సిద్ధుడు ఉపదేశించిన మంత్రం నువ్వూ నేర్చుకోవడం మంచిది,'' అని కృష్ణశర్మకు మంత్రం చెప్పి, ''నువ్వు శుచిగా స్నానం చేసి, తరవాత ఈశ్వరధ్యానం చేసి, ఉత్తరాభి ముఖంగా ఒంటికాలిపై నిలబడి, ఆ మంత్రాన్ని మూడుసార్లు పఠిస్తే వర్షం కురుస్తుంది. వర్షాన్ని ఆపాలంటే, ఉప సంహరణ మంత్రాన్ని అదే పద్ధతిలో మూడుసార్లు పఠించాలి,'' అని, అప్పుడే బయలుదేరి రాజుగారి దగ్గిరకు వెళ్ళాడు.

రాజు, రామశర్మ చెప్పింది విని, చాలా సంతోషించి, వెంటనే వర్షం కురిపించ మని అతణ్ణి అర్థించాడు.

రామశర్మ వైశాలీ నగరానికి ఉత్తర దిశగా, ఒక చెరువు కట్టపైన వున్న ఈశ్వ



రాలయానికి వెళ్ళాడు. ముందుగా అతడు చెరువులో స్నానం చేసి, దాని గట్టుపై ఉత్తరదిశగా ఒంటికాలుపై నిలబడి, మంత్రాన్ని మూడుసార్లు పఠించాడు.

అప్పటివరకూ ఎక్కడా లేని కారు మబ్బులు, క్షణాల్లో వైశాలీ రాజ్య మంతటా వ్యాపించి, భూమి దద్దరిల్లేలా పెద్ద గాలిహోరుతో వర్షం కురవడం ప్రారంభమయింది. రామశర్మ ఆనందంగా ఈశ్వరాలయంలో ప్రవేశించాడు. నగర ప్రజలు ఆనందోత్సాహాలతో, ఇళ్ళ నుంచి వీధుల్లోకి వచ్చి, నృత్యం చేయసాగారు.

రాజు సపరివారంగా వర్షంలో తడుస్తూనే ఈశ్వరాలయానికి వచ్చి, చేతులు జోడించి రామశర్మతో, "మహానుభావా, తమ కటాక్షం వల్ల వర్షం కురిసి, దేశం రక్షించబడింది. నేను వర్షం ఆపమని తమకు కబురు పంపేవరకూ, యిలాగే కురవనివ్వండి," అని ఒక పెద్ద బంగారు పళ్ళెం నిండా బంగారుకానులూ, నవ రత్నాలూ వుంచి, దాన్ని రామశర్మకు యిచ్చి, తన ప్రాసాదానికి తిరిగి పోయాడు.

బయట ఫెళఫెళారావాలతో వర్షం కురుస్తూండగా, నిర్మానుష్యంగా వున్న ఈశ్వరాలయంలో రామశర్మ ఒంటరిగా కూర్చుని, రాజు యిచ్చిన బంగారాన్నీ, రత్నాలనూ మెరిసే కళ్ళతో లెక్కపెట్ట సాగాడు. ఆ సమయంలో నలుగురు దొంగలు ఆలయం ప్రవేశించి, రామ





కొడుకు ఏమైనా సాయపడగలడేమో తెలుసుకోవలసిందిగా, మంత్రిని అతడి ఇంటికి పంపాడు.

కృష్ణశర్మ, తండ్రి మరణవార్త విని దుఃఖించాడు. అతడి తల్లీ, చెల్లెలి దుఃఖం అంతా యింతా కాదు. మంత్రి వాళ్ళతో, "దుఃఖించకండి. వానలు లేక ఎడారి కాబోతున్న వైశాలీ రాజ్యాన్ని, రామశర్మగారు తమ మంత్రశక్తితో కాపాడారు. ఎవరో దుండగులకారణంగా మీ కుటుంబానికే కాక, రాజ్యానికే తీరని నష్టం జరిగింది. ఇప్పుడు రానున్న జల ప్రళయాన్నుంచి రాజ్యాన్ని కాపాడవలసిన బాధ్యత రామశర్మగారి ఏకైక కుమారుడిది!" అన్నాడు.

శర్మను హత్యచేసి, ధనం మూటగట్టుకుని పారిపోయారు.

ఆ సాయంత్రం వరకూ వర్షం కురుస్తూనే వున్నది. రాజుగారు, మంత్రితో సంప్రతించి, అప్పటివరకూ కురిసిన వర్షం చాలునన్న నిర్ణయానికి వచ్చాడు. అయన తన మంత్రిని, రామశర్మకు ఆ సంగతి చెప్పవలసిందిగా, ఈశ్వరాలయానికి పంపాడు. అక్కడ మంత్రికి హత్య చేయబడిన రామశర్మ కనిపించాడు.

మంత్రి తిరిగిపోయి, యీ సంగతి రాజుకు చెప్పాడు. రాజు జరిగినదానికి చాలా విచారించి, యిప్పుడీ జల ప్రళయాన్ని ఆపేందుకు రామశర్మ

కృష్ణశర్మ కొంతసేపటికి దుఃఖాన్ని దిగమింగుకుని, స్నానం చేసి తన ఇంటి వాకిట్లోనే ఒంటికాలుపై ఉత్తరదిశాభిముఖంగా నిలబడి, ఉపసంహరణ మంత్రాన్ని మూడుసార్లు పఠించాడు. ఆ వెంటనే ధారాపాతంగా పడుతున్న వర్షం ఆగిపోయింది.

మంత్రి, కృష్ణశర్మకు తల వంచి నమస్కరించి, "రేపు నిండుసభలో రాజుగారు మిమ్ములను, మీ తండ్రిగారికన్న కూడా ఘనంగా సన్మానించదలిచారు. నేనే స్వయంగా ఏనుగు అంబారీలో

తమను రాజాస్థానానికి తీసుకుపోయేం దుకు రేపు ఉదయం వస్తాను,'' అని చెప్పి వెళ్ళిపోయాడు.

కాని, ఆ మర్నాటి ఉదయవేళ మంత్రి ఏనుగు అంబారీతో పరివారాన్ని వెంట బెట్టుకుని కృష్ణశర్మ యింటికి వచ్చి, ఇంటికి తాళం వేసి వుండడం చూసి, ఎంతో ఆశ్చర్యంతోపాటు చాలా వ్యాకుల పడ్డాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, కృష్ణశర్మ రాజసన్మానాన్ని కాదని, ఇల్లు వదిలి ఎటో వెళ్ళిపోవడానికి కారణం ఏమిటి? తండ్రి ఎన్నో శ్రమలకోర్చి సాధించిన మంత్రశక్తి యిప్పుడు అతడి స్వాధీనంలో వున్నది కదా? రాజు యిచ్చే ధనంతో అతడు నగరంలోనే వుండి ఎంతో సుఖంగా బతకవచ్చునే! తనను కూడా దొంగలు ధనం కోసం హత్య చేస్తారన్న భయం వల్ల, అతడు నగరం వదిలి పారి పోయాడా? లేక మరేదైనా కారణం వున్నదా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగులుతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''తన తండ్రిలా కాక, కృష్ణశర్మ ఉన్నంతలో తృప్తిగా జీవించాలనే తత్వంకలవాడు. ఆ సంగతి అతడు తండ్రితో అన్న మాటల ద్వారా మనకు తెలుస్తూనే వున్నది. ధనాశాపరుడు కాని కృష్ణశర్మ, తండ్రి ద్వారా ఉపదేశం పొందిన మంత్రశక్తిని, ఏనాడైనా పరుల మేలుకు ఉపయోగించగలడు. దాని అవ సరం ప్రస్తుతానికి వైశాలీ రాజ్యానికి లేదు. కోకొల్లలుగా ధనం గడించాలన్న ఆశలేని అతడికి, దొంగలభయం వుండే ఆస్కారమే లేదు. ఈ కారణాలవల్ల అతడు, రాజు యిచ్చే ధనానికి ఆశపడక, తనెవరో తెలియని మరొక ప్రాంతానికి కుటుంబంతో సహా వెళ్ళిపోయాడు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# వైద్యుడి ఆతృత

కూతురుకు పెళ్ళి సంబంధం కుదుర్చుకునే పనిలో, వైద్యుడు అనంతాచార్లు పొరుగూరు వెళ్ళాడు. అక్కడ అయనకు వాళ్ళ ఊరువాడొకడు కనిపించి, భూస్వామి భూషయ్య జ్వరంతో మూసినకన్నెరగకుండా పడివున్నట్టు చెప్పాడు. దానితో ఆచార్లు వున్నపళంగా బేరమైనా ఆడ కుండా రూపాయి యిచ్చి గుర్రబ్బండి కట్టించుకుని రేవు దగ్గిరకొచ్చాడు.

నదిలో వరద పొరుతూండడం వల్ల, నది దాటించే పడవవాడు బెట్టుచేయబోతే, వాడికి పావలో, అర్ధో ఎక్కువ ముట్టజెబుతానని ఆచార్లు ఆశచూపి, మొత్తానికి నది దాటి ఊరు చేరు కున్నాడు.

ఇంటికి వస్తూనే అయన మందులపెట్టె తీసుకుని, ఒక్క పరుగున భూషయ్య ఇల్లు చేరాడు. భూషయ్య మూలుగుతూ మంచంలో పడివున్నాడు. ఆచార్లు అయన నోట్లో కషాయం లాంటిది ఏదో పోసి, బయలుదేరినంత తొందరగానూ, తిరిగి చీకటిపడే సమయానికి పొరుగూరు చేరుకున్నాడు.

ఈ సంగతి విన్న ఆ ఊరివాళ్ళు, "ఆచార్లుగారూ, మీలాగా రోగులపట్ల అంత శ్రద్ధా, వృత్తిపైన అంత గౌరవం వుండేవాళ్ళు చాలా అరుదు!" అని పొగడసాగారు.

ఆచార్లు ఆ పొగడ్తలు కాసేపు విని, "ఈ శ్రద్ధా, గౌరవాల మాటకేం గాని; నేను తొందరగా వెళ్ళి, ఆ వేసేమందేదో వెయ్యకపోతే, మా భూషయ్య ఏ మందూ అక్కరలేకుండానే కోలుకుని లేచి తిరిగే ప్రమాదం వుంది. లోగడ యిలా రెండుసార్లు జరిగింది. ఇప్పుడు మందు యిచ్చి వచ్చా కనక, తరవాత వైద్యం చేసినందుకు ఆయన్ను డబ్బు అడగడానికి యిబ్బందేమీ వుండదు!" అన్నాడు.

—కమలిని





# దేవుడికి పరీక్ష

ఒక ఊళ్ళో ఒక గొప్ప భక్తుడుండేవాడు. ఆయన ఊరూరా తిరిగి ప్రజలకు దేవుడి మహిమలను గురించి బోధచేస్తూ ఉండేవాడు. ఒకరోజు ఆ భక్తుడు రామన్న పాలెం అనే గ్రామంలో ఈ విధంగా ఉపన్యాసం చేశాడు:

దేవుడు తాను పుట్టించే ప్రతి ప్రాణికీ ఆహారం సిద్ధంగా ఉంచుతాడు. అప్పుడు పుట్టిన బిడ్డకు సైతం తల్లిపాలు సిద్ధంగా ఉంటాయి. చీమలాటి సూక్ష్మప్రాణికి కూడా దేవుడు తిండి అందిస్తాడు. ఏ ఒక్క జీవినీ తిండిలేక చావనివ్వడు; ప్రతి ప్రాణికీ ఏదో విధంగా తిండి తినిపిస్తాడు. ఎవరన్నా తిననని మూర్ఖిస్తే తన్ని మరీ తినిపిస్తాడు. అందులో ఏ మాత్రం సందేహం లేదు.

ఈ విధంగా భక్తుడు ఉపన్యాసం చేస్తూ ఉంటే జనం ఆనందంగా వింటున్నారు. వారిలో సుబ్బయ్య అనే వాడికి మాత్రం ఈ ఉపన్యాసం నచ్చలేదు. అతను జనం మధ్య లేచి నిలబడి భక్తుడితో, "స్వామీ, మీరు చెప్పేది మరీ విడ్డూరంగా ఉన్నది. అయినా తిననని భీష్మించుకు కూర్చున్నవాణ్ణి దేవుడు అయితే మాత్రం ఎలా తినిపించగలడు?" అన్నాడు.

"దేవుడికి అదెంతపాటి పని, నాయనా?" అన్నాడు భక్తుడు.

సుబ్బయ్య చాలా మొండివాడు. అతను ఆ రోజు నుంచీ తిండి తినకుండా ఉండటానికి నిశ్చయించాడు; దేవుడు తన చేత ఎలా తినిపిస్తాడో పరీక్షించి చూతామనుకున్నాడు.

ఆతను ఇంటికి వెళ్ళగానే, భార్య పీటవేసి, అన్నం వడ్డించి భోజనానికి రమ్మన్నది.



"నాకు ఏమాత్రం ఆకలి లేదు. నేను భోజనం చెయ్యను," అన్నాడు సుబ్బయ్య విసుగ్గా.

"మీ కిష్టమని పెరట్లో వున్న పాదు నుంచి, ఇప్పుడే కాకరకాయలు కోసి మీ కోసం ఫక్వంగా వేపుడు చేశాను. అంత ఆకలి లేకపోతే కొంచెం తినండి," అన్నది భార్య నెమ్మదిగా.

"తిననంటూంటే నీకు కాదూ? ఏమిటా బలవంతం!" అని సుబ్బయ్య భార్య పైన ఎగిరిపడ్డాడు.

పిల్లలు అన్నాలు తింటూ తాము తినేది సుబ్బయ్య నోట బలవంతాన పెట్ట బోయారు.

ఇంటి దగ్గర ఉంటే తన దీక్ష సాగదనుకుని, సుబ్బయ్య ఇంటి నుంచి బయలుదేరి, తిన్నగా ఊరి పొలిమేర వద్దకు చేరి, అక్కడ ఒక చెట్టు కింద కూర్చున్నాడు.

ఆ ఊళ్ళోనే ఒక ఇంటివారి కోడలికి దయ్యం పట్టింది. భూతవైద్యుడు వచ్చి, మంత్రాలు చదివి, కుంభం దిగదుడుపు తీసి, దాన్ని ఊరి పొలిమేర దగ్గర వున్న మర్రిచెట్టు కింద పెట్టించమని చెప్పి వెళ్ళి పోయాడు.

ఇంటివాళ్ళ నౌకర్లు ఆ వంటకా లన్నిం టినీ తెచ్చి, సుబ్బయ్య కూర్చున్న చోటికి కొంచెం ఎడంగా వున్న ఒక మర్రిచెట్టు కింద పెట్టి వెళ్ళారు.

సుబ్బయ్యకు ఆకలి దహించుకు పోతున్నది. వంటకాల వాసనకొట్టి అతనికి నోరూరుతున్నది. అయినా దేవుణ్ణి పరీ క్షించటం కోసం అతను తన మనసును నిగ్రహించుకుని, చెట్టుకింద అలాగే కూర్చున్నాడు.

రాత్రి చాలా పొద్దుపోయింది. అర్ధ రాత్రి గడిచాక మూడో ఝాములో కొందరు దొంగలు, తాము ప్రక్క గ్రామాల్లో దొంగి లించిన సొత్తు పంచుకోవటానికి అక్కడికే వచ్చారు. మంచి వంటకాల వాసన వాళ్ళకు కూడా తగిలింది.

"ఇక్కడ ఈ పిండివంటలూ భోజనమూ ఎలా వచ్చాయి? ఈ దగ్గిర్లో ఎక్కడా ఇల్లంటూ లేదే!" అని కొందరు దొంగలు అన్నారు.

"ఎలా వస్తేనేం? చచ్చేంత ఆకలిగా వున్నది. ముందు తినేద్దాం. ఏమిటా చచ్చు సందేహాలు?" అన్నారు మరికొందరు.

"తొందరపడకండి. మనని చంపి మన డబ్బు కాజెయ్యటానికి ఎవరైనా దుర్మార్గులు విషం కలిపిన ఆహారం ఇక్కడ పెట్టి ఉండవచ్చు. అలా చేసిన వాళ్ళు దగ్గిరలోనే పొంచి ఉంటారు. చుట్టుపట్ల అంతా వెతకండి," అన్నారు ఇంకొందరు దొంగలు.

వాళ్ళు త్వరలోనే, అంత దూరంలో చెట్టు కింద నిశ్చలంగా కూర్చుని ఉన్న సుబ్బయ్యను చూశారు.

దొంగలంతా బిలబిలమంటూ పోయి సుబ్బయ్యను చుట్టుముట్టి, "ముచ్చు వెధవా! మమ్మల్ని చంపి మా డబ్బు కాజెయ్యటానికి ఇక్కడ చీకట్లో మాటు వేసి కూర్చున్నావా? మవే తిను నీ విషపు తిండి!" అన్నారు.

"అక్కడ వున్న వంటకాల సంగతి, నాకేమీ తెలీదు. నేను, ఒక కారణంగా దీక్షపట్టి, యీ చెట్టు కింద కూర్చున్నాను. ఆ పిండివంటలు నేను తినను!" అన్నాడు సుబ్బయ్య.

సుబ్బయ్య తిననంటే తిననని మొండి కెత్తటం చూసి, దొంగల అనుమానం మరింత దృఢమయింది.

వాళ్ళు సుబ్బయ్యను చావగొట్టి, బల వంతాన ఆ వంటకాలు అతని నోట గుక్కారు. వాటిని సుబ్బయ్య తినక తప్పింది కాదు.

సుబ్బయ్య వాటిని తిని చావకపోవటం చూసి దొంగలు అతనికి పెట్టటం మానేసి, కుంభం అంతా తామే తినేసి, తమ పని ముగించుకుని వెళ్ళిపోయారు.

దేవుడే నెగ్గాడు గదా అనుకుని, సుబ్బయ్య ఆ చీకట్లో పడి తిన్నగా ఇల్లు చేరుకున్నాడు.






# కలల మర్మం

కోసలదేశానికి రాజైన బింబిసార మహా రాజుకు ఒకనాటి రాత్రి చాలా విడ్డూర మైన కలలు వచ్చాయి. మర్నాడు మహా రాజు బ్రాహ్మణులను పిలిపించి, తనకు వచ్చిన కలలను గురించి వారికి చెప్పి, "ఇటువంటి స్వప్నాలకు ఫలితం ఏమిటో ఆలోచించి చెప్పండి!" అని కోరాడు.

బ్రాహ్మణులు తమలో తాము, కూడ బలుక్కున్నారు. రాజువద్ద నుంచి అంతు లేని ధనం గుంజుకోవటానికి ఇది మంచి అవకాశం. ఇది పోనివ్వకూడదని నిశ్చ యించినవారై, బ్రాహ్మణులు రాజువద్దకు వెళ్ళి, "మహారాజా, ఎన్నో గ్రంథాలు తిరగవేశాం. మీకు వచ్చిన కలలు చాలా ప్రమాదం కలిగించేవి. వాటివల్ల మీకూ, మీ వంశానికీ, మీ రాజ్యానికీ, మీ ప్రజ లకు కూడా గొప్ప అరిష్టం కలగనున్నది!" అని చెప్పారు.

ఈ మాటలు వినగానే రాజుకు మతి పోయినట్టయింది. "అయితే ఈ అరిష్టా లను నివారించే మార్గం ఏమిటి?" అని ఆయన అడిగాడు.

"అది కూడా చూసే వచ్చాం. దీనికల్లా ఒకటే విరుగుడు. మన రాజ్యంలో నాలుగు దారులు కలిసిన చోటనల్లా ఒక యజ్ఞం చేయించండి. యజ్ఞం ముగిసినాక బ్రాహ్మణులకు సంతర్పణలూ, దానాలూ ఇవ్వండి. దానితో అన్ని పీడలూ విరగడ అయిపోతాయి, మేలు కలుగుతుంది," అని బ్రాహ్మణులు సలహా ఇచ్చారు.

బింబిసార మహారాజు ముందూ వెనకా చూడకుండా, బ్రాహ్మణులు చెప్పినదంతా నమ్మేసి, తన కోశాధికారిని పిలిచి, "నాలుగు దారులు కలిసిన చోటనల్లా యజ్ఞం జరగాలి. సంతర్పణలూ, సంభా వనలూ, దానాలూ మొదలైనవి జరగాలి.

అందుకుగాను సన్నాహాలు ప్రారంభిం చండి,'' అని చెప్పాడు.

ఈ వార్త మహారాణీ తెలుసుకున్నది. ఆవిడ తన భర్తవద్దకు వెళ్ళి, ''ఏమండీ, మీరు తొందరపడి ఈ యజ్ఞాలు ప్రారంభించకండి. నిజానికి ఈ బ్రాహ్మణులేమంత తెలిసినవారు కారు. అన్నీ తెలిసిన మహాజ్ఞాని, బుద్ధభగవానుడు జేతవనంలో ఉంటున్నాడు. మీరు అక్కడికి వెళ్ళి, ఆయనకు మీ కలల వైనం చెప్పి, వాటి ఫలితం ఏమిటో అడగండి. ఆయన చెయ్యమంటే యజ్ఞాలు అలాగే చేతురుగాని!'' అన్నది.



దీనికి బింబిసార మహారాజు అంగీకరించాడు. ఆయన స్వయంగా జేతవనానికి వెళ్ళి బుద్ధభగవానుణ్ణి తమ యింట భిక్షకు ఆహ్వానించాడు. బుద్ధుడు భిక్షకోసం రాజసౌధానికి వచ్చాడు.

అప్పుడు మహారాజు బుద్ధభగవానుడితో, ''స్వామీ, తమకు తెలియని రహస్యాలుండవు. నాకు కొన్ని పీడకలలు వచ్చాయి. వాటివల్ల కలిగే దుష్ఫలితాలేవో తమరు తెలియజేయాలని నా ప్రార్థన!'' అన్నాడు.

''ఆ కలలు ఏమిటో చెబితే ఫలితాలు చెప్పగలను,'' అన్నాడు బుద్ధుడు, రాజు అమాయకత్వానికి నవ్వుతూ.

''మొట్టమొదటగా నేను కలలో నాలుగు ఆబోతులను చూశాను. అవి భీకరంగా రంకెలు వేస్తూ రాజసౌధం ఆవరణలోకి వచ్చాయి. అవి పోట్లాడుకుంటే చూసి ఆనందించుదామని జనం గుంపులు గుంపులుగా వచ్చారు. కాని ఆ ఆబోతులు పోట్లాడుకోక, వేటి దారిన అవి వెళ్ళిపోయాయి. దీని అర్థమేమిటి?'' అని మహారాజు అడిగాడు.

''రాజా, ఈ కల నీకుగాని, నీ తరానికి గాని సంబంధించినది కాదు. ముందు యుగాలలో రాజులు పాపకర్ములైపోతారు. అప్పుడు మేఘాలు వచ్చి కూడా వర్షించకుండానే వెళ్ళిపోతాయి. వాటి మీద ఎంతో



ఆశ పెట్టుకున్న ప్రజలు నిరాశ చెందుతారు," అన్నాడు బుద్ధుడు.

"తరవాత ఇంకొక వింత చూశాను. భూమిలో పుట్టిన మొక్కలు ఎంతో ఎత్తు ఎదగకుండానే పూలు పూచి, కాయలు కాయటం చూశాను. దీని రహస్య మేమిటి?" అని మహారాజు అడిగాడు.

"నే నింతకు మునుపు చెప్పిన పాపిష్ఠి కాలంలో స్త్రీలకు బాల్య వివాహాలు జరుగుతాయి. వారు పెరిగి పెద్దవారు కాక పూర్వమే బిడ్డల తల్లులవుతారు! అంత కంటె ఇంకేమీలేదు!" అన్నాడు బుద్ధుడు.

"ఆవులు దూడలవద్ద పాలు తాగేట్టు మరొక కల వచ్చింది," అన్నాడు రాజు.

"ముసలివాళ్ళు తమ తిండికోసం చిన్నవాళ్ళపై ఆధారపడే దుర్దినాలు రాబోతాయని దాని అర్థం," అన్నాడు బుద్ధుడు.

"తరవాత కలలో కొందరు రైతులను చూశాను. వారు కాడి నుంచి బలిష్ఠమైన ఎద్దులను తొలగించి, ఆ కాడికి లేగ దూడలను కట్టటం కనిపించింది," అన్నాడు మహారాజు.

"నే నింతకు పూర్వం చెప్పిన అవినీతి గల రాజులు రాజ్యాధికారాల నుంచి సమర్థులైన మంత్రులను తొలగించి, ప్రపంచజ్ఞానం లేని యువకులను ఆ పదవులలో నియోగించబోతారు. అదే ఆ కలకు అర్థం!" అన్నాడు బుద్ధుడు.

"తరవాత ఒక వింత గుర్రాన్ని చూశాను. దానికి రెండు వైపులా తల లున్నాయి. ఆ రెండు తలలతోటీ అది దాణా తింటున్నది. ఈ ఘోరం ఏమిటి, స్వామీ?" అని మహారాజు అడిగాడు.

"రాబోయే పాపిష్ఠికాలంలో న్యాయాధికారులు తగాదాలు పరిష్కరించటంలో నిష్పాక్షికంగా ఉండటానికి బదులు, రెండు పక్షాలవారి నుంచీ లంచాలు మేస్తారు. ఎవరికీ న్యాయం చెయ్యరు. అదే దాని అర్థం," అన్నాడు బుద్ధుడు.

"ఇదేమిటో చెప్పండి. ఒకడు మోకు అల్లుతూ, అల్లిన భాగం కింద వేస్తున్నాడు.

వాడు చూడకుండా ఒక అడ నక్క అల్లిన మోకును తినేస్తూ కనిపించింది." అన్నాడు మహారాజు.

"రాబోయే కాలంలో పాపం పెరిగి పోతుంది. ఆ సమాజంలో భర్తలు కష్టపడి కూడబెట్టిన ధనాన్ని, భార్యలు వెంటనే ఖర్చుచేసేస్తూంటారు," అన్నాడుబుద్ధుడు.

"తరవాత ఇంకొక చిత్రం చూశాను. రాజభవనం పక్కనే ఒక పెద్ద కడవ నిండా నీరున్నది. దాని చుట్టూ ఇంకా చిన్న కడవలెన్నో ఖాళీగా ఉన్నాయి. అక్కడికి అన్ని కులాలవారూ నీరు పట్టుకు వచ్చి, అదివరకే నిండివున్న కడవలోనే నీరు పోసి, అది పొర్లిపోతున్న సంగతి కూడా గమనించకుండా వెళ్ళి పోతున్నారు. ఖాళీ కడవల్లో ఎవరూ నీరు పొయ్యరు. ఏమిటి దీని అర్థం ?" అని మహారాజు అడిగాడు.

"ముందు, ముందు అధర్మం పెచ్చు పెరుగుతుంది. ప్రజలు కష్టించి సంపాదించిన ధనమంతా రాజుగారి ఖజానాలో పోస్తారు. ఒక వంక ఖజానాలో ధనం మూలుగుతూ వుంటే, ఇంకో వంక ప్రజల ఇళ్ళు ఆ ఖాళీ కుండల్లాగా శూన్యమై ఉంటాయి," అన్నాడు బుద్ధుడు.

"మరొక కలలో ఒక పాత్రలో అన్నం ఉడుకుతూ ఉండటం చూశాను. ఆ అన్న



మంతా ఒక రకంగా ఉడకడం లేదు. ఒక భాగంలో ఉడుకు జాస్తి అయి మెతుకు చిమిడిపోయింది. ఒక భాగంలో అన్నం సరిగా ఉడికింది. వేరొక భాగంలో బియ్యం బియ్యంగానే ఉంది." అన్నాడు మహారాజు.

"రాబోయే కాలంలో వ్యవసాయం ఇలాగే ఉండబోతుందని, ఈ కల చెబుతున్నది. పాలకులు వరదలను గురించీ, అనావృష్టి గురించీ తగు శ్రద్ధ తీసుకోరు. అందుచేత కొన్నిచోట్ల వర్షం హెచ్చుగా కురిసి, వరదలవల్ల పంటలు పాడవుతాయి. సరిగా వాన కురవని చోట అసలు పంటలే ఉండవు." అన్నాడు బుద్ధుడు.

"స్వామీ, ఇంకొక కలలో కొందరు మనుషులు అమూల్యమైన మలయ చందనాన్ని వీధి వెంట అమ్ముతూ డబ్బులు పుచ్చుకుంటూండటం చూశాను," అన్నాడు మహారాజు.

"భవిష్యత్తులో కొందరు నీచులు పవిత్రమైన ధర్మబోధలు ప్రజల కిచ్చి, అతితుచ్ఛమైన ఐహికసుఖాలను దానికి ప్రతిఫలంగా పుచ్చుకుంటారు," అన్నాడు బుద్ధుడు.

"ఇంకా, నా కలలలో నీళ్ళ మీద బరువైన రాళ్ళు తేలి కొట్టుకుపోతూండటం చూశాను. ఒక రాజహంసల గుంపు ఒక కాకి వెనక నడుస్తూ ఉండటం చూశాను. మేకలు పులులను తరిమి చంపి తింటూ ఉంటే, తోడేళ్ళు సయితం భయంతో కంపించటం చూశాను. ఇవన్నీ అరిష్ట దాయకాలు కావా, స్వామీ?" అని మహారాజు అడిగాడు.

"ఈ కలలు నీకుగాని, నీ కాలానికి గాని సంబంధించినవి కానేకావు. వాటిని గురించి నీకు ఎలాటి విచారమూ వద్దు. ఇవన్నీ భవిష్యత్తుకు సంబంధించినవి. భవిష్యత్తులో ధర్మం నశించి పాపం పెరగటం వల్ల ఎంత మహిమగలవాళ్ళు సయితం నీచులైన రాజుల అనాదరానికి గురి అయి కాలప్రవాహంలో నీవు చూసిన రాళ్ళలాగా కొట్టుకుపోతారు. పరమ నీచులు పదవులకు రావటంవల్ల రాజహంసల వంటి యోగ్యులు సయితం వారి అడుగుజాడలలోనే నడవవలసిన వారవుతారు. అధములకు అధికార బలం లభించేసరికి సత్వసంపన్నులు కూడా వారిని చూసి భయపడవలసి వస్తుంది. అంతే కాదు, అధములు వారిని నిర్మూలించటం కూడా జరుగుతుంది," అన్నాడు బుద్ధుడు.

బింబిసార మహారాజుకు సందేహం తీరిపోయింది. ఆయన భయాలు తొలగిపోయాయి. ఆయన యజ్ఞాలు చేయించే ఆలోచన కట్టిపెట్టి, బుద్ధభగవానుడికి భిక్ష పెట్టి పంపేశాడు.





# టిప్పుసుల్తాన్

మైసూరు పాలకుడైన హైదరాలీ, భారత దేశంలో పెరుగుతూన్న బ్రిటిష్ అధికారానికి తల వంచడానికి తిరస్కరించాడు. బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీకీ, అతనికీ మధ్య విరోధం తీవ్రమై యుద్ధం ప్రారంభమయింది. 1782వ సంవత్సరంలో క్యాన్సర్ వ్యాధివల్ల మరణించేంతవరకూ హైదరాలీ కంపెనీ సైన్యంతో పోరాడాడు.

హైదరాలీ అనంతరం, ధైర్యశాలీ, తెలివిమంతుడూ అయిన అతని కుమారుడు టిప్పుసుల్తాన్ సేనలకు నాయకత్వం వహించి యుద్ధం కొనసాగించాడు. టిప్పుసుల్తాన్ కనపరచిన ధైర్యసాహసాలు, శత్రుశిబిరాల్లో భయాందోళనలు కల్గించాయి.





యుద్ధంలో బ్రిటిష్ సేనలు ఓడిపోయాయి. కంపెనీ సేనానాయకుడు బ్రిగేడర్ మేథ్యూస్, టిప్పుసుల్తాన్ బందీ అయ్యాడు. 1784వ సంవత్సరంలో బ్రిటిష్ కంపెనీ టిప్పుసుల్తానుతో సంధి చేసుకోడానికి అంగీకరించింది.



టిప్పుసుల్తానుకూ, కంపెనీకీ మధ్య కొంత కాలంపాటు శాంతి నెలకొన్నది. కాని, బ్రిటిష్ ఇండియా గవర్నర్ జనరల్ కారన్‌వాలీస్, మైసూరు వీరుని లోబరుచుకోడానికి సరైన సమయం కోసం ఎదురు చూడసాగాడు. మూడు సార్లు మైసూరు మీదికి తన సేనలను పంపాడు. చివరి రెండుసార్లు తానే స్వయంగా సైన్యానికి నాయకత్వం వహించాడు.

బ్రిటిష్ సైన్యం శ్రీరంగపట్టణాన్ని పట్టుకున్నది. తన రాజ్యంలోని ఎక్కువ భాగాన్ని కంపెనీకి ఇస్తున్నట్టు 1792 వ సంవత్సరంలో, టిప్పుసుల్తాన్ ఒక ఒప్పందం కుదుర్చుకున్నాడు. అయినా, టిప్పుసుల్తాను కొడుకు లిద్దరిని, తమ వద్ద తాకట్టుగా వుంచాలని నిర్బంధించింది బ్రిటిష్ ప్రభుత్వం.





టిప్పుసుల్తాన్ ఈ దుస్థితిని సహించలేక పోయాడు. హైదరాబాదు నిజాంతో సంబంధం కుదుర్చుకోడానికి ప్రయత్నించాడు. తన కుమారునికి, నిజాం కుమార్తెను పెళ్ళి చేసుకుంటానని హైదరాబాదు నిజాంకు ప్రత్యేక దూత ద్వారా కబురు పంపాడు.

అయినా అంతకు ముందే నిజాం, కంపెనీతో మైత్రీ ఒప్పందం కుదుర్చు కున్నాడు. ఆ తరవాత టిప్పుసుల్తాన్, బ్రిటిష్‌వారిని ఎదిరించడానికి సహాయాన్ని కోరుతూ—అరేబియా, ఆఫ్ఘనిస్థాన్, టర్కీ, ఫ్రాన్స్ దేశాలకు తన దూతలను పంపాడు. అయినా ఎవరి నుంచీ సహాయం లభించలేదు.





మారిషస్ దీవిలో ఫ్రెంచి సేనలు వున్నాయని ఎవరో చెప్పగా, టిప్పు సుల్తాను నిజమనుకుని, అక్కడి ఫ్రెంచి గవర్నర్ మలార్టిక్‌కు సేనలను పంపమని రహస్యంగా కబురు పంపాడు. కాని అక్కడ ఫ్రెంచి సేనలు లేవు. అయినా టిప్పుసుల్తాన్ పట్ల తనకున్న సదభిప్రాయం వల్ల, ఫ్రెంచి గవర్నర్-బ్రిటిష్‌వారిని ఎదిరించాలని కోరిక వున్న ఎవరైనాసరే, ఇండియా వెళ్ళి, టిప్పుసుల్తాన్ సైన్యంలో చేరవచ్చుని, బహిరంగంగా చాటింపు వేయించాడు.

ఈ సంగతి, భారతదేశానికి కొత్తగా గవర్నర్‌జనరల్‌గా వచ్చిన వెలస్లీకి తెలియవచ్చింది. టిప్పుసుల్తాన్ యుద్ధం కోసం సిద్ధమవుతున్నాడని గ్రహించగానే, 1798 వ సంవత్సరంలో యుద్ధం ప్రకటించాడు వెలస్లీ. బ్రిటిష్ కంపెనీతో నిజాంతోపాటు, మహారాష్ట్రులు కూడా చేతులుకలిపారు. ఆ విధంగా టిప్పు సుల్తాన్ శత్రువులు బలవంతులయ్యారు.






శత్రువులు ఒక్కసారిగా మూడు వైపుల నుంచీ శ్రీరంగపట్టణాన్ని ముట్టడించారు. ఒక్క కంపెనీ సైన్యమే 35 వేలకు పైగా వున్నది. దానికి ఇతరులసాయం కూడా తోడుకావడంతో, టిప్పుసుల్తాన్ విజయావకాశాలు సన్నగిల్లాయి.

టిప్పుసుల్తాన్‌ను లొంగిపోయి, కంపెనీ వారిచ్చే భరణంతో హాయిగా జీవించమని కంపెనీ కోరింది. కాని, టిప్పుసుల్తాన్ అందుకు అంగీకరించ లేదు. అద్భుతమైన ధైర్యసాహసాలతో, మరణాంతం యుద్ధం చేశాడు.





తన దేశంలోని ఇతర పాలకులు, తనకు వ్యతిరేకంగా కంపెనీవారితో చేతులు కలిపినప్పటికీ---తను మాత్రం అఖరిక్షణం వరకూ కంపెనీ అధికారాన్ని ఎదిరించి, చరిత్రలో అమరుడయ్యాడు టిప్పుసుల్తాన్. ఆయన తన ప్రజలైన హిందువులను ఎంతో గౌరవంగా చూశాడు. రాణాప్రతాప్ మొగలులను ఎదిరించి పోరాడినట్టే, టిప్పుసుల్తాన్ బ్రిటిష్ అధికారాన్ని వ్యతిరేకించాడు.




పెళ్ళయి కొత్తగా కాపురానికి వచ్చింది, అరుణ. ఆమెది వేరుకాపురం. అత్తింటి వారూ, పుట్టింటివారూ కూడా మరీ, మరీ చెప్పారు. ఆమె భర్త సదానందం అన్ని విధాలా మంచివాడూ, యోగ్యుడూ. ఎటొచ్చీ అతడికి కోపం ముక్కు మీద వుంటుంది.

సదానందం పట్నంలో పెద్ద ఇల్లు అద్దెకు తీసుకున్నాడు. ఆ ఇంట్లో నాలుగు గదులున్నవి. ఇంటి వెనక పళ్ళచెట్లూ, కూరగాయలపాదులూ వున్నవి. ఆ ఇల్లు అరుణకు ఎంతగానో నచ్చింది.

ఒక వారం రోజులు హాయిగా గడిచి పోయినై. ఆ వారం రోజుల్లోనూ సదానందం భార్యతో ఎన్నోమార్లు, "అంతా నన్ను కోపిష్ఠి అంటారు. కానీ, అది నిజం కాదు. ఇతరులు నన్ను రెచ్చగొడితేనే, నాకు కోపం వస్తుంది. మామూలుగా రాదు. ఏమైనా నీ మీద మాత్రం నాకు కోపంరాదు," అని చెప్పాడు.

అలా వారం గడిచాక సదానందం, భార్యతో, "ఇల్లు చాలా పెద్దదిగా వుంది. నీకు పనిమనిషిని కుదుర్చుతాను," అన్నాడు.

"ఎందుకండీ! ఇంట్లో ఒక్కతెనూ వుండి ఏం చేయాలి? అన్ని పనులూ నేనే చేసుకోగలను," అన్నది అరుణ.

సదానందానికి చాలా కోపం వచ్చింది. "ఈ ఇంటి పనంతా ఒక్కరివల్ల అయిపోతుందని, నీ అభిప్రాయం. అంటే నేను చేయాలని—అంతే కదా? అలాగే చేస్తాలే!" అంటూ, ఆ రోజు ఉదయం అతను ఇల్లంతా ఊడ్చి, అంట్లుతోమి, బట్టలుతికి—అప్పుడు కచేరీకి వెళ్ళాడు.

మరొక రోజు సదానందం ఆమెను, "ఇల్లు బాగున్నదా?" అని అడిగాడు.

"వసుంధర"



భర్తకూ వుంటే ఎంతో బాగుండును కదా. నీ అంత అదృష్టవంతురాలిని ఎక్కడా చూడం!" అన్నదావిడ.

ఇలా వుండగా ఒక రోజున సదానందం ఇంటికి ఒక సాధువును వెంటబెట్టుకుని వచ్చాడు. ఆ సాధువుకు ఎన్నో మహిమలున్నాయని ప్రతీతి. తన భార్య అన్ని విధాలా మంచిదే కానీ, మాటిమాటికీ తనను రెచ్చగొడుతుందనీ, ఆమె స్వభావాన్ని మార్చమనీ, అతను సాధువును కోరాడు. సాధువు అరుణను పిలిచి, "నీకు, నీ భర్త అంటే అయిష్టమా?" అని అడిగాడు.

ఎంతో బాగున్నదంటూ తల వూపింది, అరుణ. "ఎందుకు బాగుండదూ! దీని కోసం బోలెడు అద్దె కడుతున్నాను. ఇంత అద్దె చెల్లించేందుకు, జీతం చాలవద్దా," అని, సదానందం వెంటనే పెరట్లోకి వెళ్ళి, మొక్కలన్నిటికీ పాదులు తవ్వి, నీళ్ళు చిమ్మి వచ్చాడు. అరుణ తనూ సాయం చేస్తానంటే కసిరిపారేశాడు.

భర్త కోపం అరుణకు వింతగా తోచింది. కోపం వచ్చినప్పుడు అతను తనను తాను నానా శ్రమా పెట్టుకుంటాడు. ఉపయోగమైన పనులే చేస్తాడు.

అరుణ పొరుగింటావిడతో, తన బాధ చెప్పుకున్నది. "ఇలాంటి కోపం, నా

అరుణ అడ్డంగా తలవూపింది.

"నీవు అతడి స్వభావంలో ఏదైనా మార్పు రావాలని కోరుకుంటున్నావా?" అని అడిగాడు సాధువు.

అరుణ అవునన్నట్టు తలవూపింది.

"అదేమిటో చెప్పు?" అన్నాడు సాధువు.

అరుణ భయం, భయంగా సదానందం కేసి చూసింది. "భయం లేదు, చెప్పు!" అన్నాడు సాధువు.

"నా భర్తకు వల్లమాలిన కోపం. మీరది తగ్గించాలి," అన్నది అరుణ.

"నీ భర్త కోపం తగ్గుతుంది. అందుకు నువ్వు ఒక మాసంపాటు, ఒంటిపూట భోజనం చెయ్యాలి," అన్నాడు సాధువు.

అరుణ అందుకు వెంటనే అంగీకరించింది. సాధువు ఆమె చెవిలో ఏదో చెప్పి, అక్కణ్ణించి వెళ్ళిపొమ్మని, సదానందంతో, "పాపం, నీ భార్యకు నువ్వంటే ఎంతో యిష్టం. ఆ వయసులో మనుమలకు ఆకలి ఎక్కువగా వుంటుంది. అయినా, ఒంటిపూట భోజనానికి సిద్ధపడిందంటే, ఆమెకు నీ కోపం వల్ల చాలా బాధ కలుగుతూ వుండి వుండాలి," అన్నాడు.

"అంతా నాటకం, స్వామీ!" అని, కోపం వచ్చినప్పుడు తను ఏమేం చేసేదీ, అంతా వివరంగా సాధువుకు చెప్పాడు, సదానందం.



సాధువు అంతా చిరునవ్వుతో విని, "నీ కోపం వల్ల, నీకు నష్టం; నీ భార్యకు లాభం. అయినప్పటికీ, నీ భార్య, నీ కోపం పోవాలనే చూస్తున్నది. అంటే, ఎంతో ఉత్తమురాలు. అటువంటి భార్య దొరకడం, నీ అదృష్టం," అన్నాడు.

సదానందానికి, ఆ మాటల్లో నిజమున్న దనిపించింది. కాని, భార్య కారణంగా తాను సాధువుచేత మాటపడవలసి వచ్చిందని, చాలా కోపం వచ్చింది. సాధువు వెళ్ళిపోగానే అతను భార్య మీద మండిపడి, అప్పటికప్పుడు నీళ్ళుతోడి, ఇల్లంతా శుభ్రంగా కడగడం మొదలుపెట్టాడు. అరుణకు ఏం చేయాలో తోచక, ఇంట్లోంచి బయిటికి వెళ్ళిపోయి, సాయంత్రానికి తిరిగి వచ్చింది.

"ఎక్కడికి వెళ్ళావు?" అని కోపంగా అడిగాడు సదానందం.

"పొరుగింట్లో పని చేయడానికి వెళ్ళాను," అన్నది అరుణ.

సదానందం మరింత కోపంగా, "అంత కర్మ నీకేం పట్టింది?" అని అడిగాడు.

"కర్మ కాదు, కోపం. అనవసరంగా మీరు, నా మీద కోప్పడుతూంటే, నాకూ కోపం వస్తున్నది. నాకూ పని చేయాలని పిస్తున్నది. ఇంట్లోపని మీరు చేయనివ్వరు. అందుకని పొరుగింట్లో పని చేస్తున్నాను," అన్నది అరుణ.

"నువ్వు పొరుగింట్లో పని చేస్తే, నా పరువేంకావాలి ?" అన్నాడు సదానందం.

"మీ పరువుకు ఏ భంగమూ రాదు. నా భర్తకు అనారోగ్యంగా వున్నదనీ, ఆయనకు తిరిగి ఆరోగ్యం కలగాలంటే, ఒక సాధువు యిలా పొరుగింట్లో పని చేయమన్నాడనీ, ఆ ఇంటివారికి చెప్పాను," అన్నది అరుణ.

"ఏమైనాసరే, నువ్వు పరాయి ఇంట్లో పని చేయడానికి వీల్లేదు," అన్నాడు సదానందం.

"మీరు మన ఇంట్లో యిలా పని చేసి నంతకాలం, నేను పరాయి ఇంట్లో పని చేస్తూనే వుంటాను," అన్నది అరుణ.

"ఇంట్లో నేను పని చేయడం వల్ల, నీకు నష్టమేమిటి ?" అన్నాడు సదానందం.

"నేను పరాయి ఇంట్లో పని చేయడం వల్ల, మీకు నష్టమేమిటి? మీ కోపం నాకు సాయపడుతున్నది; నా కోపం పొరుగింటివాళ్ళకు సాయపడుతున్నది," అన్నది అరుణ.

భార్యతో యింత వాదు జరిగాక, సదానందానికి అసలు విషయం అర్థమయింది. భార్యంటే తనకు ప్రేమ. అందువల్లే, ఆమె కష్టపడితే తను చూడలేడు. అదే విధంగా, ఆమెకూ తనంటే ప్రేమ. తను కష్టపడితే, ఆమె చూడలేదు. ఈ విషయమే సాధువు కూడా చెప్పాడు!

"నన్ను మన్నించు, అరుణా! ఇక ఎన్నడూ, నీమీద కోపం తెచ్చుకోను," అన్నాడు సదానందం.

"సాధువు చెప్పిన ఉపాయం ఫలించింది! ఆయన చెప్పినట్టే, నెల రోజుల పాటు ఒంటిపూట ఉపవాసం కూడా వుంటాను," అని, భర్త ఎంత చెప్పినా వినకుండా అలాగే చేసింది, అరుణ. ఆమెతోపాటే, అన్ని రోజులూ సదానందం కూడా ఉపవాసాలున్నాడు.

ఆ తర్వాత నుంచీ, ఆ భార్యా భర్తలిద్దరూ, ఒకరిపై ఒకరు కోపగించుకోకుండా, ఒకరికొకరు సాయపడుతూ సుఖంగా జీవించారు.





# నాటకాల పిచ్చి

గోవిందు చిన్నతనం నుంచీ చదువుకోకుండా, నాటకాల పిచ్చితో తిరిగాడు. వాడు నెలరోజుల క్రితం పుట్టి పెరిగిన గ్రామం వదిలి పట్నం వచ్చి, అక్కడ ఒక నాటకసమాజంలో చేరి, వేషం ఒకటి సంపాయించాడు. వాళ్ళు ఒక వారం రోజుల్లో నాటక ప్రదర్శన ఏర్పాటు చేయబోతున్నారు.

ఆ నాటకంలో గోవిందు, తల్లితో పోట్లాడి ఇల్లు వదిలి వస్తాడు. అతడి మేనమామ వాణ్ణి వెతుక్కుంటూ వచ్చి, వాడి తల్లి బెంగతో మంచం పట్టిందని చెబుతాడు. అయినా గోవిందు తల్లిని చూసేందుకు రానని మొండికెత్తుతాడు. చివరకు తల్లే అంత జబ్బులోనూ, వాడున్న చోటుకు వస్తుంది. తల్లి ప్రేమను అర్థం చేసుకున్న గోవిందు, ఆమెతోపాటు ఇంటికి వెళ్ళిపోతాడు.

నాటకంలో గోవిందు మేనమామ పాత్ర, సమాజం యజమాని రాజారాం వేస్తున్నాడు. గోవిందుకు యింకా తన పాత్ర సంభాషణలు బాగా కంఠస్థం కాలేదు. ఆ కారణంగా రోజూ సాయంత్రం వేళ రాజారాం వచ్చి, వాడికి సంభాషణలు నేర్పుతున్నాడు.

ఆ రోజు రాజారాం కొంచెం చీకటి పడ్డాక వచ్చి, "గోవిందూ, నాకు లక్ష పనులు. ఈ వేళకు తప్ప రావడం కుదరదు మరి!" అన్నాడు.

"అలాగే కానివ్వండి!" అంటూ గోవిందు వేగంగా ఇంటి పెరట్లోకి దారి తీశాడు.

ఆ పెరడును అనుకుని జమీందారు గారి భవనపు ఎత్తయిన ప్రహరీ గోడ ఒకటి వున్నది. అది బాగా శిథిలమైపోయి, గోడలో పెద్ద, పెద్ద కంతలు ఏర్పడినై.

మాచిరాజు కామేశ్వరరావు



రాజారాం నాటకంలోని సంభాషణలు ప్రారంభిస్తూ, "నువ్వు ఇల్లు వదిలాక, మీ అమ్మ ఆరోగ్యం బాగా చెడిపోయింది. ఇంటికి వెళదాం పద!" అన్నాడు.

"నేను రాను, మామయ్యా! ఇక అమ్మ మొహం చూడను," అంటూ కోపం నటించాడు గోవిందు.

"అదేం మాటరా? నువ్వు చూడాలని అనుకోకపోయినా, కొడుకును చూడాలని తల్లి మనసు కొట్టుకులాడుతుంది. నువ్వు రాకపోతే, అమ్మ దక్కడం కష్టం," అన్నాడు రాజారాం.

ఈ విధంగా గోవిందుతో కలిసి, కొంత సేపు నాటక సంభాషణలు వల్లె వేశాక, రాజారాం వెళ్ళిపోయాడు. గోవిందు పెరట్లోని నూతి దగ్గిర కాళ్ళూ, చేతులూ కడుక్కుని, పెరటి ద్వారంకేసి బయలు దేరుతూండగా, శిథిలమైపోయిన గోడ కంతలోనుంచి చిన్నగా చప్పట్లు విని పించినై. గోవిందు అదిరిపడి, భయంగా అటుకేసి చూశాడు.

"ఈ చీకట్లో, నన్నేదో పిశాచం అను కుంటున్నావేమో! నేను పిశాచాన్నేం కాదు; ఇటు రా," అన్న కంఠ స్వరం వినిపించింది.

దానితో గోవిందు కొంత ధైర్యం తెచ్చు కుని గోడ కంతకేసి వెళ్ళాడు. అవతల తెల్లటి జుట్టుతో, గడ్డంతో ఒక వృద్ధుడు వాడి కంటబడ్డాడు.

"నీ తల్లి చావుబతుకుల మధ్య వున్న దని, మేనమామ రమ్మని అంతగా బతిమాలుతూంటే, రానని మొండి కెత్తుతావేం? వెంటనే వెళ్ళు," అన్నాడు వృద్ధుడు.

ఈ ముసలాడు నాటకంలోని సంభా షణలు యథార్థం అనుకుంటున్నాడని, గోవిందు గ్రహించాడు.

"ఎవరు చచ్చి గీ పెట్టినా, నేను వెళ్ళను. అయినా, నేను వెళ్ళకపోతే, నీ కొచ్చిగే నష్టం ఏమిటి?" అన్నాడు గోవిందు చిరాకు నటిస్తూ.

వృద్ధుడు ఒకటి, రెండు క్షణాలు ఏదో ఆలోచిస్తూ పూరుకుని, తరవాత, "అంత కోపం తెచ్చుకోకు. ఈ పక్కన వున్న భవనం నాదే! నేనూ, నీలాగే చిన్న తనంలో ఇంటినుంచి పారిపోయాను. మా అమ్మ, నా పేరే కలవరిస్తూ చనిపోయింది. ఆ తరవాత ఇల్లు చేరాను. ఏం లాభం?" అన్నాడు.

దానితో గోవిందుకు, ఆ మాట్లాడేది ముసలి జమీందారని తెలిసిపోయింది. ఆ వెంటనే వాడికి మెరుపులా ఒక ఆలోచన వచ్చింది.



"మాది తిండికీ, బట్టకూ కటకటలాడే సంసారం. డబ్బు సంపాయించుదామని పట్నం వచ్చాను. మా గ్రామం చాలా దూరం. వెళ్ళాలంటే బోలెడు ఖర్చు!" అన్నాడు గోవిందు విచారపడుతున్నట్టు.

ఆ జవాబుకు ముసలి జమీందారు పెద్దగా నవ్వి, "నిన్ను తీసుకుపోదామని వచ్చిన మేనమామ, ఆ బోలెడు ఖర్చుకు సరిపడా డబ్బు తెచ్చే వుంటాడు. అయినా, నేనూ యిస్తాను ఆగు. ఒంటరి వాణ్ణి; డబ్బుకేం కొదవలేదు," అంటూ గోడ కంత దగ్గిర నుంచి వెళ్ళిపోయాడు.

ఒక పావుగంట గడిచింది. శిథిలమైన గోడ పక్కన చీకట్లో నిలబడి వున్న గోవిందుకు, తనతో మాట్లాడింది ముసలి జమీందారా, లేక ఏదైనా పిశాచమా అన్న అనుమానం కలిగింది. ఆ భయంతో వాడు దిక్కులు చూస్తున్నంతలో జమీందారు రానే వచ్చాడు.

ఆయన గోడ కంతలోంచి చిన్న మూటను గోవిందుకు అందిస్తూ, "ఇది తీసుకుని, ఉదయాన్నే బయలుదేరి, మీ గ్రామం వెళ్ళిపో," అన్నాడు.

గోవిందు ఇంట్లోకి వచ్చి, దీపం వెలుగులో మూట విప్పిచూశాడు. అందులో మిలమిల మెరుస్తూ పది బంగారు కాసు లున్నవి. సంతోషంగా వాడు వాటిని తిరిగి మూటకట్టి, తన బట్టల పెట్టెలో అట్టడుగున దాచేశాడు.



మర్నాడు వాడు చుట్టుపక్కల విచారించగా, ముసలి జమీందారు చాలా ఉదారగుణం కలవాడనీ, కష్టాల్లో వున్న వాళ్ళకు విరివిగా దానధర్మాలు చేస్తూంటాడనీ తెలిసింది.

ఈ సంగతి విన్నాక గోవిందుకు, ముసలి జమీందారు నుంచి మరి కొంత డబ్బు సంపాయించాలని ఆశ పుట్టింది. ఆ రోజు చీకటిపడుతూనే రాజారాం వచ్చాడు. ఇద్దరూ కలిసి పెరట్లోకి వెళ్ళారు.

రాజరాం నాటకంలోని తరవాతి సంభాషణలు ప్రారంభిస్తూ, "మీ అమ్మ, నీ కోసమే కళ్ళల్లో ప్రాణాలు పెట్టుకుని వుంది. ఇప్పటికైనా బయలుదేరు!" అన్నాడు.

"మామయ్యా, నేను మాట అంటే, మాటే. దానికి తిరుగుండదు. నేనురాను, అంతే!" అన్నాడు గోవిందు విసురుగా.

"నీకు ఒంట్లో బాగాలేదనీ, నాలుగైదు రోజులు పోయాక తీసుకువస్తాననీ, మీ అమ్మతో చెబుతాను. రేపటికయినా మనసు మార్చుకుని, నా వెంటరా," అని రాజారాం వెళ్ళిపోయాడు.

గోవిందు, యీ సంభాషణ జమీందారు వినివుంటాడని ఆశగా గోడకంతకేసి చూసేంతలో, అక్కడ నుంచి అయన, "డబ్బు యిచ్చాగదా. వెళతానని వెళ్ళక, యింకా నీ మేనమామతో పేచీ పడతావెందుకు?" అని అడిగాడు.

గోవిందు ఎంతో వినయంగా, "తమకు చెప్పలేదు. ఇక్కడ నాకు పీకలు మునిగేంత అప్పులున్నవి. అవి తీర్చకుండా వెళ్ళడం న్యాయం కాదుగదా!" అన్నాడు.

"అవును, న్యాయంకాదు. ఈ అప్పుల సంగతి నిన్ననే చెప్పవలసింది. కాస్త ఆగు!" అంటూ ముసలి జమీందారు వెళ్ళి, కొంతసేపటికి ఒక చిన్న మూటతో తిరిగి వచ్చాడు.

ఆత్రంగా గోడకంతకేసి చేయిచాచిన గోవిందుకు మూట అందిస్తూ, జమీందారు,

''ఇక ఆలస్యం చేయక, రేపు మీ గ్రామం వెళ్ళు. చేసిన తప్పుకు, మీ అమ్మను క్షమాపణ కోరుకో,'' అన్నాడు.

గోవిందు మళ్ళీ దీపం వెలుగులో మూట విప్పి చూశాడు. ఈసారి అందులో ఇరవై బంగారు కాసులున్నవి. వాడు వాటిని కూడా పెట్టె అడుగున భద్రంగా దాచేశాడు.

ఈ విధంగా ముప్పై బంగారు కాసులు సంపాదించాక, వాడికి ముసలి జమీందారు నుంచి మరికొంత డబ్బు సంపాయించాలన్న దురాశ మరింతగా పెరిగింది. ఇందుకు మార్గమేమిటా అని వాడు పగలల్లా ఆలోచిస్తూ, ఇల్లు కదలలేదు.

ఆ రోజు సాయంత్రం రాజారాం వస్తూనే, ''గోవిందూ, నాటకం ముగింపులో చిన్న మార్పు చేయడం జరిగింది. తల్లిపాత్ర చనిపోవడం ద్వారా, కొడుకులో బాగా పశ్చాత్తాపం కలిగించాలనుకున్నాం. ఆ మారిన సంభాషణలు చెబుతా రా!'' అంటూ గోవిందును పెరట్లోకి తీసుకుపోయి, ''అంతా అయిపోయింది. తల్లీ కొడుకుల ఋణం తీరిపోయింది! నీకు ఒంట్లో బాగా లేదని చెప్పగానే, మీ అమ్మ అంత జ్వరంలోనూ బాడుగ బండిలో నీ దగ్గిరకు వచ్చేందుకు బయలుదేరింది. కాని, ఏం లాభం! బండి గ్రామం



దాటిందో లేదో, నిన్నే తలుచుకుంటూ కళ్ళు మూసింది,'' అన్నాడు.

గోవిందు అయిష్టంగా తలాడిస్తూ, ఏదో అనబోయేంతలో, ముసలి జమీందారు గోడ కంత వైపు నుంచి పెద్దగా, ''ఒరే, దుష్టుడా! ఇలా జరుగుతుందని, నాకు మొదటి నుంచీ అనుమానంగానే వున్నది, వస్తున్నానుండు,'' అంటూ కేక పెట్టాడు.

ఆ మాటలు విని రాజారాం కంగారుగా, ''ఇంత చీకట్లో, ఎవరది? పిశాచమేం కాదుగదా!'' అన్నాడు.

గోవిందుకు మాట పెగలలేదు. వాడు నిలువెల్లా వణికిపోతూ ఇంటోకి వచ్చేసరికి, అక్కడ ముసలిజమీందారూ,

ఆయన వెంట పెద్ద దుడ్డుకర్రతో నౌకరూ కనిపించారు.

జమీందారు, గోవిందుడి కేసి కోపంగా చూస్తూ, "ఇంటికి వెళ్ళమని, నీకు ముప్పై బంగారు కాసు లిచ్చాను. అయినా, కన్నతల్లి చావుకు కారణం అయావు. నీలాంటివాడి నీడ చూడడం కూడా మహా పాపం!" అని తన నౌకరు కేసి తల తిప్పాడు.

జమీందారు నౌకరు, ఇల్లంతా వెతికి, చివరకు గోవిందు బట్టలపెట్టెలో నుంచి బంగారు కాసులున్న రెండు మూటలూ బయిటికి తీసి, యజమాని వెనకగా, ఇంటి నుంచి బయిటికి వెళ్ళిపోయాడు.

ఆ సరికి జరిగిందేమిటో రాజారాంకు అర్థమైపోయింది. అతడు పళ్ళు కొరుకుతూ గోవిందు కేసి చూసి, "నాటకం లోని సంభాషణలు నిజం అనుకుని జమీందారు, నీకు అంత బంగారం యిచ్చాడన్నమాట! నాతో ఆ సంగతి మాటవరసకైనా అనలేదు. నీ స్వార్థమే నిన్ను దెబ్బతీసింది. నీలాంటి దురాశా పరుడికి, నా నాటక సమాజంలో చోటు లేదు. మరేనాడూ అటుకేసి రాకు!" అంటూ వెళ్ళిపోయాడు.

గోవిందుకు ఎక్కడలేని పశ్చాత్తాపం కలిగింది. తను కన్నతల్లినే కాక, దయా ధర్మగుణాలుకల ముసలిజమీందారును కూడా మోసగించాడు. ఉన్న గ్రామంలో ఏదో వ్యాపారం పెట్టుకుంటానంటే తల్లి, చేతులకున్న రెండు బంగారు గాజుల్లో ఒకటి యిచ్చింది. అది తీసుకుని పట్నం చేరి, నాటకాల పిచ్చికొద్దీ యిక్కడ కాలం గడిపేస్తున్నాడు.

తను ఇంటికి తిరిగి వెళితే, తల్లి చాలా ఆనందిస్తుంది. ఇంటిపట్టునే వుండి, ఏదైనా వ్యాపారం చేసుకుంటూ, ముసలి తనంలో తల్లికి ఏ కష్టం రాకుండా చూసుకోవాలనుకున్నాడు, గోవిందు.

ఇలా నిర్ణయించుకున్న గోవిందు, మర్నాడు సూర్యోదయంతోనే తన గ్రామానికి ప్రయాణం కట్టాడు.





# పిసినారి దానగుణం

రామాపురంలో ప్రతాపరాయు డనే జమీం దారుండేవాడు. అయన పరమ పిసినారిగా చుట్టుపక్కల గ్రామాల్లో పేరు పొందాడు. ఆయనకు వృద్ధాప్యం వచ్చాక కొంచెం పాపభీతితోపాటు దైవచింతన కలిగింది.

ఒకసారి రామాపురానికి ఒక సన్యాసి వచ్చాడు. ప్రతాపరాయుడు ఆయన దర్శనం చేసుకుని, తాను చనిపోయాక పుణ్యగతులు కలిగేందుకు, ఏం చేయాలో చెప్పవలసిందిగా కోరాడు. సన్యాసి ఆయ నకు విరివిగా దానధర్మాలు చేయమని సలహా యిచ్చాడు. అలాగే చేస్తానని ప్రతాపరాయుడు ఇంటికి తిరిగి వచ్చాడు.

సన్యాసితో, జమీందార్లు అన్న మాటలు, అ సమయంలో అక్కడ వున్న ఒక పేద బ్రాహ్మడు విన్నాడు. అతను మర్నాటి ఉదయం జమీందారు ఇంటికి వెళ్ళాడు. అప్పుడు జమీందారు ఒక వాలుకుర్చీలో కూర్చుని వున్నాడు. ఆయన విలువైన పట్టువస్త్రాలు ధరించి, మెడలో బంగారు గొలుసుతో, ఐదువేళ్ళకూ వజ్రాలపొడి ఉంగరాలతో కనిపించేసరికి, పేద బ్రాహ్మడికి, తనకేదో మంచి దానం లభిస్తుందన్న ఆశకలిగింది.

జమీందారు, పేద బ్రాహ్మడికేసి చూసి, అతడు వచ్చిన పని గ్రహించి, మర్నాడు రమ్మన్నాడు.

మర్నాడు జమీందారింటికి వచ్చిన బ్రాహ్మడు, ఆయన్ని చూసి చాలా ఆశ్చర్య పోయాడు. ఇప్పుడు జమీందారు సాదా దుస్తులు ధరించి వున్నాడు. ఒంటి మీద ఆభరణాలు లేవు.

ఆయన బ్రాహ్మణ్ణి నవ్వుతూ పలక రించి, "ఒకరు ఎక్కువ, ఒకరు తక్కువ అన్న భావం నాకు నచ్చలేదు. అందుచేత నేను జమీందారీ పద్ధతుల్ని వదిలేసి,

డాక్టర్ బి. ఎస్. ఎన్. మూర్తి

నీలాగా సామాన్య పౌరుడిలా బతకదలి చాను. ఇప్పుడు నువ్వూ, నేనూ ఒకటే! అందుచేత నీకు దానం చెయ్యడం అన్న ప్రసక్తే లేదు,'' అన్నాడు.

పేద బ్రాహ్మడు వినయంగా, ''మీరు వేషం మార్చినా, ఆస్తి మీదికాకుండా పోదుగదా? అందువల్ల మీరు తప్పకుండా, నాకన్న గొప్పవారు. కనక, నాకు ఏదైనా దానమిచ్చి అనుగ్రహించాలి,'' అన్నాడు.

జమీందారు ఒక్క క్షణం తలాడిస్తూ వూరుకుని, బ్రాహ్మణ్ణి రేపు రమ్మన్నాడు.

మర్నాడు వచ్చిన బ్రాహ్మడు, జమీం దారును చూసి మరింతగా ఆశ్చర్య పోయాడు. ఇప్పుడు జమీందారు కాషాయ వస్త్రాలు ధరించి వున్నాడు.

ఆయన బ్రాహ్మడితో, ''నేను సన్యాసం పుచ్చుకున్నాను. ఈ ప్రపంచంలో డబ్బుకూ, నాకూ సంబంధం లేదు,'' అన్నాడు.

''మరి, మీ ఆస్తి అంతా ఏం చేశారు?'' అని అడిగాడు పేద బ్రాహ్మడు.

''నేను వదిలేశాక, అది నా కుమారులకే చెందుతుంది గదా!'' అన్నాడు జమీందారు.

''అందులోనే కొంచెం దానమివ్వండి!'' అంటూ బ్రాహ్మడు చేతులు చాచాడు.

''నేనెలా యిచ్చేది? దానం చేసేందుకు, నా దగ్గిరేం వుంది కనక,'' అన్నాడు జమీందారు.

''పోనీ, తమ కుమారులనే అడుగుతాను,'' అంటూ పేద బ్రాహ్మడు ముందుకు వెళ్ళబోయాడు.

జమీందారు అతణ్ణి వారిస్తూ, ''వాళ్ళు, నా నుంచి తమకు సంక్రమించిన ఆస్తిలో, దానంలాటి వృధాఖర్చులు చెయ్యమని ప్రతిజ్ఞ చేశారు. వాళ్ళు తండ్రికిచ్చిన మాట జవదాటరు!'' అన్నాడు.

పేద బ్రాహ్మడు పెద్దగా నిట్టూర్చి అక్కణ్ణించి వెనుదిరిగాడు. ఇది జరిగాక, ఇక యాచకులు తన దగ్గిరకు రారన్న ధీమాతో, జమీందారు ఆ రాత్రి హాయిగా నిద్ర పోయాడు.





# విష్ణుకథ

కృష్ణుడి ఔన్నత్యం పెరుగుతున్నట్లే, శత్రువులు కూడా పెరిగారు. శిశుపాల జరాసంధుల కూటంలో చాలా మంది దుర్మార్గులైన రాజులు కలిశారు. పౌండ్రకుడనే కరూశదేశరాజు కృత్రిమ కరచేతులను శంఖచక్రాలతో చేయించుకొని, భుజాలకు తగిలించుకొని, పెద్ద గదను పట్టుకొని, తానే విష్ణు అవతారుడిననీ, వాసుదేవుడననీ, కృష్ణుడు కానేకాడనీ ప్రగల్భాలు చాటుకుంటున్నాడు. శిశుపాలుడి మరొక తమ్ముడు సాల్వుడు సౌభక మనే విమానం మీద, ద్వారకా నగరం పైన విహారం చేస్తూ కయ్యానికి కాలుదువ్వుతున్నాడు. తూర్పు దిశను నరకాసురుడు ప్రచండంగా చెలరేగుతున్నాడు. దక్షిణంలో బలిచక్రవర్తి కుమారుడైన బాణాసురుడు, శివుడి రక్షణతో శోణపురాన్ని రాజధానిగా రాక్షస పాలన విస్తరింపజేస్తున్నాడు.

కాలయవనుడి తమ్ముడు కాలాంతకుడు తనకు జీవిగా పుట్టిన ఎవ్వరివల్లా భయం లేదన్న దైవజ్ఞ నిర్ణయం ధీమాతో, యవనమ్లేచ్ఛ సైన్యాలతో దారుణ రక్తపాతం సాగిస్తూ, దేవతా విగ్రహాలనూ శిల్పాలనూ ధ్వంసం చేస్తూ, దేశాలను కొల్లగొడుతూ కృష్ణుణ్ణి హతమార్చాలని పగబట్టాడు.

దండయాత్ర సాగిస్తూ గాంధారసీమలో జగన్మోహనంగా పాలరాతితో మలచిన మోహినీ శిల్పాన్ని చూసి వివశుడయ్యాడు.

## 17. కృష్ణ విజయాలు



ఆ విగ్రహాన్ని కృష్ణుడు విశ్వకర్మ చేత చేయించి, తన యోగమాయాగ్నిని దాని లోకి పంపి, అక్కడ పెట్టించాడని కాలాంతకుడికి తెలియదు.

ఆ సాలభంజికా ప్రతిమను తరలించుకుపోయి, కాలాంతకుడు తన అంతఃపుర మందిరంలో పెట్టుకొని, ఆ శిల్ప సుందరికి ప్రాణం వస్తే ఎంత బాగుండును, అని గుటకలు మ్రింగుతున్నాడు.

ఒకనాటి రాత్రి మురళీ గానానికి అనువుగా మ్రోగుతున్న అందెలసవ్వడికి మేల్కొని విగ్రహానికి బదులు నాట్యం చేస్తున్న సుందరిని చూశాడు. మోహావేశంతో కాలాంతకుడు తటాలున వెళ్ళి ఆమె చేతులను తన మెడ చుట్టూ వేసుకొన్నాడు. మరుక్షణమే ఆమె యథా ప్రకారం శిలావిగ్రహం అయింది. విగ్రహం బాహుబంధంలో మెడ బిగుసుకుపోయి గిలగిల తన్నుకొంటూ, బొగ్గుగా మాడిపోయి దభీమని కింద పడిపోయాడు. విగ్రహం చేతులు విరిగిపోయాయి. కాలాంతకుడు చచ్చాడు. యవన రాజ్యంలో చేతుల్లేని మొండి మోహినీ విగ్రహం మిగిలిపోయింది.

కాలాంతకుడి సేనలను కృష్ణుడు తరిమి తరిమి కొట్టాడు. అంతలో పెద్ద అగ్నిపర్వతం పగిలి యవనరాజ్యాన్ని ధ్వంసం చేసింది.

పడమటి దిక్కున మ్లేచ్ఛ, యవనుల అలజడి తొలగిందంటే, ఇటు తూర్పున ప్రాగ్జ్యోతిషాన్ని పాలించే నరకాసురుడి విజృంభణ మరింత ఉపద్రవంగా తయారయింది.

వరాహావతారం భూమిని ఉద్ధరించినప్పుడు భూదేవికి పుట్టిన నరకాసురుడు ప్రాగ్జ్యోతిషపురాన్ని రాజధానిగా చేసుకొని, అసుర సేనలతో దేవలోకం మీద దాడి చేసి, దేవతలను పాదాక్రాంతులుగా చేసుకున్నాడు. దేవమాత అదితి కుండలాలను లాక్కొచ్చాడు. మునులను, సాధు సజ్జను

లను హింసిస్తూ, భూమిని మరొక నరకం చేశాడు. పదహారువేల మంది కన్యలను చెరదెచ్చాడు.

దేవతలు, మునులు నరకుడి పీడ తొలగించమని కృష్ణుడిని ప్రార్థించారు. కృష్ణుడు వారికి అభయమిచ్చి బయలు దేరాడు. కృష్ణుడి వెంట సత్యభామ కూడా బయలుదేరింది.

తల్లి భూదేవివల్ల గాయపడితేనే తప్ప, నరకాసుర సంహారం అసంభవమని వరం ఉంది. సత్యభామ భూదేవి అంశతో పుట్టినది.



సత్యభామతో కృష్ణుడు గరుడవాహనా రూఢుడై ప్రాగ్జ్యోతిషం మీద దాడిచేసి, అసురసేనలను రూపుమాపాడు.

నరకాసురుడు మదగజాన్నెక్కి ఎదు రొక్కన్నాడు. యుద్ధం చేసి కృష్ణుడు విశ్రాంతి తీసుకుంటున్న సమయంలో, సత్యభామ నరకుడితో గొప్పగా యుద్ధం చేసింది.

సత్యభామ ఆకర్ణాంతము నారిసారించి విడిచిన బాణం నరకుడి గుండెలో బలంగా నాటుకొంది. అమ్మా! అని నరకుడు నేలకొరిగి తుది సాహసంతో గదను ఎత్తి కృష్ణుడి పైకి లంఘించాడు. కృష్ణుడు చక్రాయుధంతో నరకుడి తల నరికాడు.

తల తెగిపడుతూ కృష్ణుడిని విష్ణువుగా స్తుతించుతూ నరకాసురుడు, తన జ్ఞాప కార్థం లోకులు తననిర్యాణాన్ని పండగ జరుపుకోవాలని వరం కోరుకున్నాడు.

నరకాసుర సంహారం జరిగిన రోజు నరక చతుర్దశి, మర్నాడు నరకపాలన అంతరించిన దీపావళి పండుగలు ఏర్పడ్డాయి.

నరకుడి కుమారుడు భగదత్తుడిని పట్టాభిషిక్తుణ్ణి చేసి, అదితి కుండలాల్ని పుచ్చుకొని, సత్యాకృష్ణులు ద్వారకకు చేరారు.

ఒకనాడు కృష్ణుడు రుక్మిణీదేవి మంది రంలో ఉండగా, నారదుడు వచ్చి పారి



జాత పుష్పాన్ని యిచ్చాడు. కృష్ణుడు దాన్ని రుక్మిణికిచ్చాడు. అది తెలిసి సత్యభామాదేవి అలిగింది. పారిజాత వృక్షాన్నే ఆమె ఇంట నాటుతానని కృష్ణుడు బుజ్జగించాడు.

అదితి కుండలాల్ని యిచ్చే పనిగా, సత్యభామతో కృష్ణుడు గరుత్మంతునిపై దేవలోకం వెళ్ళాడు. అదితి కుండలాల్ని అప్పగించి, సత్యతో నందనవనవిహారం చేస్తూ కృష్ణుడు పారిజాత వృక్షాన్ని పెకలించాడు.

సత్యాకృష్ణులు పారిజాతాపహరణం చేసి వెళ్తూంటే, దేవేంద్రుడు యుద్ధానికి వచ్చాడు. ఇంద్రుడు విసిరిన వజ్రాయుధం గరుత్మంతుడి రెక్కకు తాకగా ఒక ఈకను విదిలించి వదిలాడు.

ఇంద్రుడు గర్వభంగం పొంది, కృష్ణుడున్నంతకాలం, పారిజాత వృక్షం భూమ్మీద ఉంటుందని చెప్పాడు.

సత్యభామ అంతఃపురోద్యానవనంలో పారిజాత వృక్షం పూలతో వికసించింది.

కృష్ణుడు పుత్రప్రాప్తి కోసం కైలాసానికి వెళ్ళి తపస్సు చేసి శివానుగ్రహం పొందాడు. ఆ అదనులో సాల్వుడు, పౌండ్రకుడు ద్వారకావాసులకు అలజడి కలిగించారు. కృష్ణుడు వారిని వధించాడు.

దంతవక్త్రుడు చచ్చిన వారికి ఉత్తర క్రియలు జరిపి వస్తూండగా కృష్ణుడు ఎదురయ్యాడు. గదను ఎత్తి దంతవక్త్రుడు కృష్ణుడిపై లంఘించాడు. కృష్ణుడతడిని సంహరించగా వెలువడిన విజయుని అంశ జ్యోతిరూపంలో కృష్ణుడిలో చేరింది.

కృష్ణుడికి ప్రద్యుమ్నుడు మొదలైన పెక్కుమంది కుమాళ్ళు కలిగారు. ప్రద్యుమ్నుడి కుమారుడైన అనిరుద్ధుణ్ణి కలలో బాణాసురుడి కుమార్తె ఉష చూసి మురిసింది. ఆమె చెలికత్తె చిత్రలేఖ శాంబరీ మాయా ప్రభావంతి, అనిరుద్ధుడిని ఉష అంతఃపురానికి తెచ్చింది. ఉష అతణ్ణి వరించింది.



బాణాసురుడు అనిరుద్ధుణ్ణి నాగ పాశంతో బంధించి చెరలో పెట్టాడు. మనవడి కోసం కృష్ణుడు యుద్ధానికి వచ్చాడు. శివుడు బాణుడి కోసం కృష్ణుడితో యుద్ధంచేసి ఓడిపోయాడు.

కృష్ణుడు బాణాసురుడి వెయ్యి చేతులలో రెండు మిగిల్చి, మిగతా వాటిని నరికాడు. బాణాసురుడు శరణాగతుడై కృష్ణుడితో వియ్యమందాడు. ఉషానిరుద్ధుల కళ్యాణం జరిగింది. దక్షిణంలోని అసురులకూ, ఉత్తరంలోని రాజులకూ సంబంధ బాంధవ్యాలు ఏర్పడి సమైక్యత వర్ధిల్లింది.

కృష్ణుడు పాండవులకు అండగా నిలబడ్డాడు. బలరాముడికి సమ్మతం కాక పోయినా కృష్ణుడు చెల్లెలైన సుభద్రకు అర్జునుడితో వివాహం జరిగేలాగ సహాయం చేశాడు.

బావమరదులైన కృష్ణార్జునులు ఖాండవ దహనం జరుగుతున్నప్పుడు ఆ వనంలో ఉన్న రాక్షస మహాశిల్పి మయుడిని కాపాడారు. మయుడు పాండవులకు గొప్ప సభను నిర్మించుతానన్నాడు. అగ్నిదేవుడు కృష్ణుడికి సుదర్శనచక్రాన్నీ, పాంచజన్య శంఖాన్నీ, అర్జునుడికి గాండీవ ధనుస్సునూ, అక్షయ తూణీరాల్నీ, దేవదత్త శంఖాన్నీ సమర్పించాడు.

ధర్మరాజు రాజసూయ యాగం తలపెట్టాడు. జరాసంధుణ్ణి అంతం చేయవలసిన సమయం వచ్చింది.

కృష్ణుడు, భీమార్జునులు మారువేషాలతో గిరివ్రజపురం చేరి, అతిథులుగా జరాసంధుడి మందిరానికి వెళ్ళారు.

జరాసంధుడు, బకాసురుడు, దుర్యోధనుడు, కీచకుడు, భీముడు సమబలులు. వీరిలో ఒకడి చేతనే మిగిలిన నలుగురూ చంపబడతారనే సంగతి కృష్ణుడికి తెలుసు. అదివరకే భీముడు బకాసురుణ్ణి చంపాడు కనుక, భీముడే జరాసంధుణ్ణి చంపాలి. జరాసంధుడు అస్త్రశస్త్రాలతో చావడు. అతని శరీరాన్ని రెండుగా చీల్చి చంపాలి



సవ్యంగా వేరుచేశాడు. ఆ విధంగా కృష్ణుడు భీముడిచేత జరాసంధుణ్ణి అంత మొందించాడు.

భీష్ముడు చెప్పగా ధర్మరాజు రాజ సూయానికి అగ్రపీఠాన్ని, అగ్రతాంబూలాన్ని కృష్ణుడికి యిచ్చాడు.

సభా మధ్యంనుండి శిశుపాలుడు లేచి అధిక్షేపించాడు. కత్తిదూసి పాండవులనూ, కృష్ణుడినీ హతమారుస్తానన్నాడు. పెళ్ళి కూతుర్ని ఎత్తుకుపోయిన కృష్ణుడు దొంగ, కులహీనుడు అంటూ దూషించాడు.

అప్పటికే శిశుపాలుడి అపరాధాలు నూరింటికి మించిపోయాయి.

తాము భోజనానికి బదులు, తమలో ఏ ఒక్కరితోనైనా మల్లయుద్ధాన్ని కోరి వచ్చామని కృష్ణుడు చెప్పాడు. జరా సంధుడు వాళ్ళెవరైనదీ గ్రహించాడు.

''కృష్ణా! నీవు నాకు వెరచి ప్రవర్షణ గిరికి పారిపోయిన వాడివి. అర్జునుడు అర్భకుడు. భీముడే నాకు సరియైన జోడీ!'' అన్నాడు జరాసంధుడు.

భీముడికీ, జరాసంధుడికీ ముష్టి యుద్ధం, మల్లయుద్ధం ఘోరంగా జరి గింది. భీముడు జరాసంధుణ్ణి చిత్తుచేసి, కృష్ణుని ఆదేశసంకేతం ప్రకారం జరా సంధుణ్ణి రెండు సమభాగాలుగా చీల్చి, అవి తిరిగి కలుసుకోకుండా వాటిని అప

కృష్ణుడు చక్రంతో శిశుపాలుడి తల ఖండించాడు. శిశుపాలుడి నుండి జయుని అంశ జ్యోతిరూపంలో కృష్ణుడిలో ఐక్య మైంది. జయ విజయులు మూడవ జన్మ సమాప్తమై, వారి శాపం తొలగి విష్ణు ద్వారపాలకులుగా వైకుంఠాన్ని చేరారు.

దుర్యోధనుడు పాండవులకు మయుడు నిర్మించిన మయసభను చూసి అబ్బుర పడుతూ, అనేక భంగపాట్లు పడ్డాడు. రత్నకంబళము పరచి ఉన్నదనుకొని అడుగువేసి నీటిలో పడ్డాడు. అది చూసి ద్రౌపది నవ్వింది. దుర్యోధనుడు అవ మానంతో కుమిలిపోయాడు. శకుని అతన్ని ఓదార్చి పాండవుల్నీ, ద్రౌపదినీ దుర్యో

ధనుడికి బానిసలుగా చేస్తానన్నాడు. ధర్మ రాజును జూదానికి రప్పించమన్నాడు.

కుచేలుడు కృష్ణుడి బాల్యస్నేహితుడు. కృష్ణబలరాములు సాందీపుని దగ్గర విద్యాభ్యాసం చేశారు. కుచేలుడు సహ విద్యార్థి.

అధిక సంతానంతో, పేదరికంతో కృంగి పోతూన్న ఆ బ్రాహ్మణుడు భార్య సలహాతో కృష్ణుణ్ణి కలుసుకోడానికి బయలుదేరాడు. అతని భార్య రుచికరంగా కొద్ది అటుకులను చేసి చిన్న మూటగట్టి యిచ్చింది.

అష్టమహిషులు సేవిస్తూండగా సౌధో పరిభాగంలో తూగుటూయెల ఊగుతున్న కృష్ణుడు దూరాన వస్తూన్న కుచేలుడిని చూసి పాదచారిగా ఎదురేగివెళ్ళి, బాల్య మిత్రుణ్ణి గాఢాలింగనం చేసుకొని, మందిరానికి తోడ్కొనివచ్చి, తన సింహాసనం మీద కూర్చుండబెట్టాడు.

కృష్ణుడి ఎనమండుగురు దేవేరులు కుచేలుడికి సమస్త మర్యాదలు చేశారు. కృష్ణుడి ఆదరానికి ఆనందపారవశ్యంలో మునిగిన కుచేలుడి చేతనున్న అటుకుల మూటను కృష్ణుడు తీసుకుని, మూట విప్పి పిడికిలి నిండుగాతీసి, ఆప్యాయంగా ఆరగించాడు. అష్టమహిషులు మిగిలిన వాటిని పంచుకొని తిన్నారు.

కుచేలుడు తానెందుకు వచ్చాడో మరచి పోయిన ఆనందంతో, కృష్ణుడిని మనసులో మరీ మరీ తలంచుకొంటూ, తిరుగు ప్రయాణమై ఇంటికొచ్చేసరికి గుర్తు పట్టలేక పోయాడు.

అతని చిన్న ఇంటికి మారుగా గొప్ప భవనం! ఆ భవనానికి వెండి బంగారాల జిలుగుల గోడలు, రత్నాలు పొదిగిన స్తంభాలు కనిపించాయి. అతని భార్య ఆభరణాలతో మెరిసిపోతున్నది. పిల్లలు పట్టుబట్టలతో వసంతంలో కుసుమాల్లాగ ఆనందంగా ఆడుకొంటున్నారు. అష్ట సిరులు అతని ఇంటినిండుగా వెల్లివిరిశాయి.

కుచేలుడూ, అతడి భార్యాపిల్లలూ కృష్ణుడి కృపా విశేషాన్ని కొనియాడుతూ భక్తి తత్పరులై సుఖించారు.





# వింత పక్షి

పర్షియా దేశంలోని షిరాజ్ నగరం గొప్ప వర్తక కేంద్రమే కాక, ముఖ్యమైన యాత్రా స్థలం కూడా. అందువల్ల నగరానికి వివిధ ప్రాంతాల నుంచి ప్రజలు వస్తూండేవాళ్లు. అలా నగరం చేరేవారు, ఒక అరణ్యం గుండా ప్రయాణం చేయవలసి వుండేది. అక్కడ తరచుగా వాళ్ళకు ఒక వింత పక్షి కనబడుతూండేది. దాన్ని చూసిన వాళ్ళు, ఈనాటి వరకూ అంత అందమైన పక్షిని తాము చూడలేదని అబ్బురపడే వాళ్ళు. ఇక దాని పాట కూడా విన్నవాళ్ళు, దాన్ని గంధర్వగానంతో సరిపోల్చేవాళ్ళు.

ఆ వింతపక్షిని పట్టుకునేందుకు చాలా మంది ప్రయత్నించారు. అలాంటివాళ్లల్లో, ధనిక కుటుంబాల యువకులే కాక, పొరుగు రాజ్యాల రాకుమారులు కూడా వున్నారు. కాని, ఆశ్చర్యం కలిగించే సంగతేమంటే, అలా వెళ్ళినవాళ్ళల్లో ఒక్కరూ తిరిగి రాలేదు. అందరూ రాళ్ళుగా మారిపోయారు.

ఈ వింతపక్షిని గురించి విన్న షిరాజ్ రాజు కూతురుకు, దాన్ని తనదిగా చేసుకోవాలన్న కోర్కె కలిగింది. ఆమె తండ్రి అనుమతితో ఒక చాటింపు వేయించింది. అదేమంటే—ఆ వింతపక్షిని పట్టితెచ్చిన వాడిని తాను వివాహమాడుతుంది.

నగరంలో ధనిక కుటుంబాలకు చెందిన ముగ్గురు యువకులున్నారు. వాళ్ళు బాల్యమిత్రులు. వాళ్ళల్లో ఒకడు వింతపక్షిని పట్టి తెచ్చి, రాకుమారిని వివాహమాడేందుకు అరణ్యానికి వెళ్లాడు.

అరణ్యంలో ఆ పక్షి ఏ ప్రాంతాల తిరుగుతూండేదీ, వాడు ప్రయాణీకుల ద్వారా తెలుసుకుని, వెతుకుతూ, ఒకనాటి మిట్టమధ్యాహ్నం వేళ, దాన్ని ఒక చెట్టు కొమ్మ పైన చూశాడు. వాడు దాన్ని

అరేబియా కథ



పట్టుకునేందుకు, చెట్టును సమీపించేంతలో, పక్షి గొంతెత్తి అతి శ్రావ్యంగా పాడసాగింది. ఆ పాట విని తన్మయుడై వాడు కూడా గొంతెత్తి, దాన్ని అనుకరించబోయాడు. ఆ మరుక్షణం వాడు ఉన్న చోటునే రాయిగా మారిపోయాడు.

ఒక నెల గడిచింది. ముగ్గురు మిత్రుల్లో రెండవవాడు, పక్షి కోసం బయలుదేరాడు. వాడికీ రాజకుమార్తెను పెళ్ళాడాలన్న కోర్కె వున్నది. కాని వాడూ తిరిగి రాలేదు. రెండు నెలలు గడిచిపోయినై.

మిత్రుల్లో మూడవవాడైన హనీఫ్ అరణ్యానికి బయలుదేరాడు. వాడు, తనను వెళ్ళవద్దని వారించ చూసిన వాళ్ళతో, ''నాకు ఆ వింతపక్షిని పట్టుకోవాలనిగానీ, రాకుమార్తెను వివాహమాడాలనిగానీ లేదు. నా ఇద్దరు మిత్రులూ ఏమయ్యారో తెలుసుకునేందుకు పోతున్నాను. సాధ్యమైతే, వాళ్లను రక్షించి తీసుకువస్తాను," అన్నాడు.

హనీఫ్‌కు అరణ్యంలో ఒకచోట వింత పక్షి కనబడింది. అది వాణ్ణి చూస్తూనే గొంతెత్తి శ్రావ్యంగా పాడసాగింది. హనీఫ్ దాని పాట విని ముగ్ధుడైపోయి, తానూ పాడాలనుకున్నాడు. కాని, ఎంతో ప్రయత్నం మీద నిగ్రహించుకుని, దాన్ని సమీపించాడు. పక్షి పాట ఆపి, హనీఫ్ కేసి చూసింది. హనీఫ్ దాన్ని సునాయాసంగా పట్టుకున్నాడు.

హనీఫ్ ఆప్యాయంగా వింతపక్షి తల నిమురుతూ, ''నీది అద్భుతమైన అందం! ప్రపంచంలో నీలాంటి పక్షి మరొకటి వుండదు. నా మిత్రులిద్దరికీ తిరిగి ప్రాణదానం చేయలేవా ?'' అని అడిగాడు.

పక్షి తలాడించి, ''సరే, నీ కోర్కె నెరవేరుస్తాను. రాళ్ళుగా వున్న నీ మిత్రులపైన నన్ను ఎగరనివ్వు.'' అన్నది.

హనీఫ్ పక్షిని విడిచాడు. అది రాళ్ళ రూపంలో వున్న హనీఫ్ మిత్రుల మీద వలయాకారంలో రెండుసార్లు ఎగిరింది. వెంటనే మిత్రులిద్దరికీ యథారూపాలు వచ్చినై.

ఈసారి హనీఫ్ పక్షితో, "నీ అందం చూసి, నిన్ను పట్టుకోవాలని యింకా కొందరు కూడా యిక్కడికి వచ్చి, రాళ్ళుగా మారిపోయారు. వాళ్ళనూ తిరిగి మనుషులుగా చెయ్యి," అన్నాడు.

వింతపక్షి రాళ్ళ రూపంలో వున్న వాళ్ళ మీదుగా, తిరిగి వలయాకారంలో రెండుసార్లు ఎగిరింది. ఆ మరుక్షణం, రాళ్ళుగా మారిపోయిన వాళ్ళందరికీ మానవరూపాలు వచ్చినై. వాళ్ళు హనీఫ్‌కు తమ కృతజ్ఞత చెప్పుకుని, తమ తమ ప్రాంతాలకు బయలుదేరి పోయారు.



హనీఫ్ పక్షితో, "నీ మేలు ఎన్నటికీ మరవను. నువ్వు, నాతోపాటు నగరానికి రాకూడదా?" అన్నాడు.

"ఎందుకు రాను!" అంటూ పక్షి ఎంతో మృదువుగా జవాబు పలికింది.

వెంటనే హనీఫ్ తన వెంట తెచ్చిన పంజరం తలుపు తెరిచాడు. పక్షి అతడితో, "నా ఎడమ కాలికి వున్న ఉంగరాన్ని చూశావా! దాన్ని తీసుకుని, నీ వేలికి పెట్టుకో. అది ముందు, ముందు నీకెంతో మేలు చేయగలదు," అని చెప్పి, పంజరంలోకి వెళ్ళింది.

హనీఫ్, దాని కాలి ఉంగరం తీసుకుని తన వేలికి పెట్టుకున్నాడు. తరవాత ముగురు మిత్రులూ నగరానికి బయలుదేరారు. దారిలో చీకటి పడింది. ముగ్గురూ ఆ రాత్రికి అరణ్యంలోనే ఒక చెట్టు కింద పడుకున్నారు.

ఒక అర్ధరాత్రివేళ హనీఫ్ మంచి నిద్రలో వుండగా, దుష్టులైన అతడి మిత్రులిద్దరూ కూడబలుక్కుని, హనీఫ్ కాళ్లూ, చేతులూ బంధించి, దాపుల వున్న ఒక పాడుబడిన బావిలో పడవేశారు. అదృష్టవశాత్తూ, అందులో నీళ్ళు లేవు; మెత్తని ఇసుక పేరుకుని వున్నది. హనీఫ్‌కు దెబ్బలు తగల్లేదు గాని, పడినపాటుకు మూర్ఛపోయాడు.

పావుగంట తరవాత హనీఫ్‌కు స్పృహ వచ్చి కళ్ళు తెరిచాడు. అతడి పక్కన




నల్లగా వున్న భూతం ఒకటి కూర్చుని వున్నది. హనీఫ్ ఒక్క క్షణకాలం భయకంపితుడై, అంతలోనే తేరుకుని, "ఎవరు నువ్వు ?" అని భూతాన్ని అడిగాడు.

"నేను, నీ వేలికి వున్న ఉంగరంలోని భూతాన్ని. నువ్వు బావిలో పడుతున్నప్పుడు, ఉంగరం బావిరాళ్ళకు గీసుకున్నది. అందువల్ల నేను ప్రత్యక్షమయాను. నీ ఆజ్ఞ కోసం ఎదురు చూస్తున్నాను," అన్నది నల్లభూతం.

"నన్ను బావిలోంచి పైకి తీసుకుపో," అన్నాడు హనీఫ్.

వెంటనే భూతం అతణ్ణి బావిలోంచి బయిటికి తెచ్చింది. హనీఫ్, భూతంతో, "నేను వెంటనే నగరం చేరాలి. స్వారీ చేసేందుకు గుర్రంగా మారు," అన్నాడు.

నల్లభూతం గుర్రంగా మారి, హనీఫ్‌ను నగరం చేర్చింది. ఆ సమయాన రాజభవనంలో వేడుకలు జరుగుతున్నవి. అందుకు కారణం, రాకుమారికి వింత పక్షి బహూకరణ జరగడం. అయితే, రాజభవనం ముందు హనీఫ్ మిత్రులిద్దరూ పోట్లాడుకుంటున్నారు. వాళ్ళు రాజుతో ఆ పక్షిని నేను పట్టుకున్నానంటే నేనని చెబుతున్నారు. రాజుకు ఏం చేయాలో పాలుబోవటం లేదు.

హనీఫ్, రాజును సమీపించి, "ప్రభూ, ఆ పక్షినే అడగండి. నిజం తెలిసిపోతుంది," అన్నాడు.

హనీఫ్‌ను చూసి, అతడి దుష్ట స్నేహితులిద్దరూ నిలువెల్లా వణికిపోసాగారు.

"ఆ పక్షి మాట్లాడడం లేదు. అదీ వచ్చిన చిక్కు," అన్నాడు రాజు చిరాకుగా.

"ఆ పక్షిని, నా దగ్గిరకు తెప్పించండి. తప్పక మాట్లాడుతుంది," అన్నాడు హనీఫ్.

రాకుమారి మందిరం నుంచి పక్షిని తీసుకువచ్చారు. హనీఫ్, దానితో, "అరణ్యంలో నిన్నెవరు పట్టుకున్నారో, నిజం చెప్పు !" అన్నాడు.

పంజరంలో వున్న వింతపక్షి వెంటనే, "నాకు స్వేచ్ఛ యివ్వండి. పంజరంలో వుండగా నేను ఏ ప్రశ్నకూ జవాబు చెప్పను," అన్నది.

వింత పక్షిని పంజరం నుంచి వదల డానికి రాజకుమార్తె అనుమతి కోరారు. నిజంగా దాన్నెవరైతే పట్టితెచ్చారో, అతణ్ణే ఆమె పెళ్ళాడవలసి వున్నది. అందువల్ల, రాజకుమార్తె పక్షి కోరినట్టుగా, దాన్ని పంజరంనుంచి వదలడానికి ఒప్పుకున్నది.

నౌకరు పంజరం తలుపు తెరవగానే, వింతపక్షి ఎగిరి హనీఫ్ భుజం మీద కూర్చుని, "నన్ను అరణ్యంలో పట్టుకున్నది నువ్వే! నువ్వే!" అంటూ రెండుసార్లు పలికింది.

పక్షి అలా అనగానే హనీఫ్ మిత్రులిద్దరూ అక్కణ్ణించి పారిపోజూశారు. కాని, రాజుగారి భటులు వాళ్ళను తరిమి పట్టుకున్నారు.

రాజు వాళ్ళకేసి పళ్ళు కొరుకుతూ చూసి, "ఈ దుర్మార్గుల తలలు నరకండి!" అంటూ భటులకు ఆజ్ఞ యిచ్చాడు.

హనీఫ్ రాజుతో, "ప్రభూ, వీళ్ళను క్షమించి వదలండి. అరణ్యంలో బండ రాళ్ళుగా పడివున్న వీళ్ళకు, నేను ప్రాణ దానం చేశాను. వాళ్ళ దుర్మరణం నాకు బాధ కలిగిస్తుంది," అన్నాడు.

హనీఫ్ యిలా కోరగానే, రాజు, ఆ ఇద్దరు దుష్టుల్నీ విడిచిపుచ్చవలసిందిగా భటులను ఆజ్ఞాపించాడు. వింతపక్షి హనీఫ్ భుజం మీది నుంచి రెక్కలల్లాడించి లేచి, అరణ్యంకేసి రివ్వున ఎగిరి పోయింది.

రాజకుమార్తెతో హనీఫ్ వివాహం వైభవంగా జరిగింది. ఆ తరవాత అతడూ, రాజకుమార్తే సంవత్సరానికి ఒకసారి వింతపక్షిని చూసేందుకు అరణ్యానికి వెళ్ళేవాళ్ళు. అయితే, ఆ పక్షి శ్రావ్యంగా పాడడం మొదలుపెట్టాక, ఆనందంకొద్దీ దానితోపాటు పాడకుండా తగు జాగ్రత్తలో వుండేవాళ్ళు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1984 జూలై నెల సంచికలో ప్రకటింపబడును.



A. Lakshmana Rao



G. Srinivasa Murthy

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ మే నెల 15 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/—లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:— చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### మార్చి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: ఎందుకంత భయం? రెండవ ఫోటో: ఏకపాత్రాభినయం!

పంపినవారు: ఆర్. పట్టాభిరామరాజు, గిరిపురం, తిరుపతి-517501

*బహుమతి మొత్తం రు. 50/—నెలాఖరులోగా పంపబడుతుంది.*

### మీకు తెలుసా? సమాధానాలు:

1. కాళిదాసు. 2. హెూమర్. 3. జాన్‌మిల్టన్. 4. కౌటిల్యుడు. 5. సర్ విన్‌స్టన్ చర్చిల్.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.